# సుభాష చంద్రబోసు

## జీవితము, ఉపన్యాసములు.



కొమాండూరి శఠకోపాచార్యులు,
ఎం. ఏ., బి. ఎల్.

# సుభాష చంద్రబోసు

జీవితము, ఉపన్యాసములు.



కొమాండూరి శఠకోపాచార్యులు,
ఎం. ఏ., బి. ఎల్.

# భూమిక.

యువకనాయకుడగు సుభాషచంద్రబోసు మన మహా పురుషులలో నొకడు. జాతీయకార్యములందు నెహ్రూ పెట్టిన క్రొత్తపద్ధతులను ఉజ్జీవనమును అమలుజరిపించి వృద్ధిజేయుటకు సుభాషే సర్వవిధములను తగినవాడు; కనుక, జవాహర్లాలు తరువాత కాంగ్రెసు కీసారి సుభాషే అధ్యక్షుడు కావలెనని గాంధిమహాత్ముడును సూచించెను.

ఆయనప్రతిభ, సహృదయత, ఉత్సాహము, దయాశీలత, సానుభూతి, త్యాగము, కష్టసహనము, నిర్వాహశక్తియు, అద్భుతములు.

సుభాషుజీవిత మింతవరకు చాలవరకు జైలులోను విదేశములందును గడచినది; జనులలో బాగుగ పనిచేయుట కిప్పుడే, ఆయనకు పూర్తియగు అవకాశముగల్గినది. కాంగ్రెసు ముంద స్థితిని గ్రహించుటకు, దానిప్రస్తుతనాయకుడగు సుభాషుజీవిత సంగతుల గ్రహించుట అవసరము.

ఇంతవర కాయనజీవితచరిత్ర మేభాషలోను నాకు దొరకలేదు. పృథ్వీశచంద్రరాయిగా రింగ్లీషులో నొక చిన్న పుస్తకము వ్రాసినారు. దాని నుపయోగించినాను. కాని అది 1929 ది; అందు చాలసంగతులు లేవు. తక్కినవానిని కలకత్తా

మునిసిపల్ గజెట్టువద్ద రాపత్రికలనుండి గ్రహించినాను. ఆయనకు బి. ఏ. చదువులో సహాధ్యాయి (ప్రస్తుతము కాకినాడ కాలేజిలో అధ్యాపకులు) అగు శ్రీవినయభూషణరక్షితుగారినుండి, సుభాషువిద్యార్థిదశలోని కొన్నిసంగతులు తెలిసికొంటిని; వారికెంతయు కృతజ్ఞుడను. ఆయనభావములు ముందుకార్యక్రమము నెట్లుండునో గ్రహించుటకై, 1928 లో మహారాష్ట్ర మహాసభలోను, ఈ 1938 లో కాంగ్రెసుమహాసభలోను ఆయన యిచ్చిన అధ్యక్షోపన్యాసముల సారము, లండనులో విద్యార్థుల కుపోద్ఘతమును గూడ చేర్చినాను. ఇందలి చిత్రపటముల బ్లాకులు ఆంధ్రపత్రికాలయమువారు తయారుచేయించి యిచ్చినవి.

1-3-38. కా. శ.



# విషయసూచిక.

---



---

# 1. వంశము, పుట్టుక.

సుభాషచంద్రుని పూర్వులు వంగరాష్ట్రమునను పెద్ద గౌరవవంశపువారు. వారు 'వసు' వంశీయులు. ('వసు' పదమే బంగాళీ ఉచ్చారణలో 'బోసు' అయినది). ఈ వసువులలో ఆ యాశాఖలవారు ప్రజ్ఞావంతులై, ప్రయోజకులైనారు. వీరంద రును 'కాయస్థు'లు. వీరిలో కొందరు తాము బ్రాహ్మణుల మందురు. కాని కాయస్థులు క్షత్రియులని చాలమంది అభిప్రా యము. మనదేశమందు బ్రిటిషుపాలన రాగనే, కొందరు బంగాళీ లాంగ్లవిద్య నేర్చిరి. గతశతాబ్దిలోను ఈశతాబ్దిలోను చాల మంది బంగాళీలు బిహారు ఒరిస్సాప్రాంతములకు వలసవెళ్ళి, ఆయాప్రాంతములందనేకవృత్తులలో ప్రసిద్ధిజెందినారు. (అప్ప టి కాప్రాంతములు బెంగాలురాష్ట్రపుపాలనలోనే చేరినవి). వీరి కుటుంబము నట్టిదే.

మన సుభాషబోసు పూర్వికులు అసలులో కలకత్తా ప్రక్కనున్న '24 పరగణాలు'జిల్లాలోని 'కొడాలియా' అను గ్రామమునందుండిరట. వారును మరికొందరును (ఇక్కడ ఆంధ్రు లును తమిళులును ఆయాప్రాంతములకు వెళ్ళియున్నట్లు) తమ జిల్లావిడచి, ఓఢ్రప్రాంతమందు వసింపసాగిరి. ఇట్టివారి వంశీయు లలో నొకరు (సుభాషచంద్రుని తండ్రి) 'జానకీనాథబోసు'.

జానకీనాథుని బాల్యము మిడ్నపు (=మేదినీ) పురంలో గడచెను. అప్పటికతను చాల బీదవాడు. కాని కుశాగ్రబుద్ధి; ఎట్లో, మిత్రుల ద్రవ్యసహాయముతో, ఆంగ్లము నున్నతవిద్య నేర్చుకొనెను; న్యాయశాస్త్రముగూడ జదివి, కలకత్తా విశ్వ విద్యాలయపు ఎం. ఏ., బి. ఎల్. పరీక్షలలో కృతార్థుడాయెను. ఆయన ముందుగా మిడ్నపురములో వకీలువృత్తి నారంభించెను; కాని ఇంతలో కొందరు బంధుమిత్రులాయనను కటకము రమ్మ నికోరుటచే కటకమునకు మార్చుకొన్నాడు. అక్కడ జిల్లా కోర్టులో ఆయనకు త్వరలోనే మంచిపేరు వచ్చినది. ఆయన మేధావి, విద్వాంసుడు, శ్రద్ధాళువు, అనుభవజ్ఞుడు; త్వరలోనే ప్రముఖుడాయెను. కనుక, ప్రభుత్వమువారాయనను కటకం జిల్లాకోర్టులో తమతరఫువకీలుగ జేసుకొనిరి. ఆయన అక్కడ చాలద్రవ్యమును (తద్ద్వారాభూములను గూడ) సంపాదించి, మంచి స్థితిపరుడాయెను; పరోపకారియై, అక్కడి సంఘసేవా కార్యములందును శ్రద్ధవహించెను. కొంతకాలము కాయనకు సర్కారువారు 'రాయబహద్దరు' బిరుదు నిచ్చిరి.

జానకీనాథుని కెనమండ్రుకొడుకులు. ఆయన పిల్లల విద్యాబుద్ధులగూర్చి ప్రత్యేక శ్రద్ధవహించి, అందరికిని ఆంగ్ల విద్య నేర్పెను. అప్పటికి మనదేశపు విశ్వవిద్యాలయము లున్నత స్థితికి రాలేదు. కనుక ఆయన వ్యయప్రయాసలకోర్చి, కొమా ళ్ళందరిని ప్రశస్తవిద్యకై ఆంగ్లదేశము కంపెను. ఆ శ్రమ ఫలించి,

అందరును ప్రయోజకులై జాతీయవాదులైనారు. పెద్దవాడగు శరచ్చంద్రుడును ఇంకొకడు సతీశచంద్రుడును బారిస్టర్లై, కలకత్తాలో ప్రసిద్ధ న్యాయవాదులుగ నున్నారు. శరచ్చంద్రుడు చాల సమర్థుడు, పెద్ద కేసులలో పనిచేయుచుండును, జాతీయవాది, కాంగ్రెసుప్రముఖుడు, ప్రజాకార్యములకు సహకారి; ఇటీవల అఖిలభారత కాంగ్రెసువర్కింగుకమిటీ (=కార్యసమితి) లో సభ్యుడై, వంగరాష్ట్రకాంగ్రెసుకమిటీ కధ్యక్షుడుగను, బెంగాలు అసెంబ్లీలో కాంగ్రెసుపక్ష నాయకుడుగను ఉన్నాడు. సుభాషు కింకొక అన్నయగు సురేశచంద్రుడు డిప్యూటీ కలెక్టరు ఉద్యోగముచేయుచు, సమర్థుడని ప్రసిద్ధుడైనాడు; కాని సత్యాగ్రహకాలమందు ప్రభుత్వపు నిరంకుశచర్యల సహింపక ఉద్యోగమును వదలుకొన్నాడు; ఇప్పుడు వ్యాపారము చేయుచున్నాడు.

సుభాషుకు చిన్నన్నయగు సునీలచంద్రబోసు వైద్యశాస్త్రమందు ఎం. డి. పరీక్షనిచ్చి స్వదేశమునకు మరలివచ్చి, కలకత్తాలో డాక్టరుగ నున్నాడు. ఆయన ఘనవైద్యులలో నొకడు, సిద్ధహస్తుడు, గొప్ప పరోపకారి. ఈ మహనీయకుటుంబములో 6 వ కొడుకు సుభాషచంద్రబోసు. అతడు 1897 లో కటకములో పుట్టెను.

# 2. బాల్యవిద్య.

సుభాషు బాల్యజీవితమున విశేషములు కనబడవు. సోదరులందరును పరస్పర మనురాగులై యుండిరి. సుభాషు తల్లి చాలగుణవతి, ఉదారురాలు, ధర్మనిరత; ఆమె దైవభక్తి గొప్పది; అది సుభాషునకును అలవడినది. అతడు బాల్యమునుండి స్వభాషయగు బెంగాలీలోని భక్తిగ్రంథముల జదువుచు, అందలివిశేషములను తల్లినుండి నేర్చుకొనెను. అతడు కటకం హైస్కూలులో ఆంగ్లవిద్య నేర్చుకొని, చురుకుగనే పరీక్షలనిచ్చుచు, 1913 లో మెట్రిక్యులేషను(=మన యిప్పటి స్కూలుఫైనలు) పరీక్షకు వెళ్ళెను; అందు బెంగాలురాష్ట్ర మంతటికిని 2వ వాడుగ ఉత్తీర్ణుడై, ఖ్యాతినొందెను. అంతట తండ్రి యాతని నున్నతవిద్యకై కలకత్తా కంపెను.

మనదేశమంతటిలో కలకత్తాలోనే హెచ్చుకళాశాలలున్నవి. అందు కొన్ని మిషనరీలవి; కొన్ని ప్రజాప్రముఖులు స్థాపించినవి; అన్నిటిలోను ప్రసిద్ధము 'ప్రెసిడెన్సీకాలేజి'. దానిని ప్రభుత్వమువారే నడుపుదురు. అందుప్రవేశము దొరకుట కష్టము. అప్పుడు ప్రఫుల్లచంద్రరాయి, జగదీశచంద్రబోసు మొదలగు జగత్ప్రసిద్ధులందు ఆచార్యులై బోధించుచుండిరి. వారు భారతీయులకీర్తిని ఆత్మగౌరవమును హెచ్చించిరి. సుభాషు

చాల బాగుగ 'ప్యాసై'నందున, అతనినాకళాశాలలో వెం టనే చేర్చుకొనిరి. అతడు శ్రద్ధతో కృషిచేయుచు, బాగుగ జ్ఞాన మార్జించెను. కాని ఆతడప్పుడును కాలేజిచదువులోనే మగ్నుడు కాలేదు. విద్యార్థులు సార్వజనికసంగతుల చర్చించు కొను కాలేజిసంఘములం దతడు ప్రధానుడై, ఆయామతసాంఘిక విషయములందు శ్రద్ధతీసుకొనెను, మరియు, అక్కడి 'సోష ల్ సర్వీస్ లీగు' (=సంఘసేవాసమితి) లోను ముఖ్యుడై, విద్యా ర్థులువద్దరాలనుండి చందాలుపోగుచేసి, ఆసొమ్ముతో కలకత్తా ప్రాంతపు బీదలకు రాత్రి పాఠశాలల నడిపించి, విద్యావ్యాప్తి జేయుంచెను; కష్టాతురుల కెంతో సాయపడుచుండెను.

అప్పుడొకసారి యొకచిత్రము జరిగినది. ఇంటరుక్లాసు 2 వ సం॥ లో అతనికొక మతావేశము కలిగినది. చిన్నప్పుడు తల్లి కల్గించిన ధార్మికోత్సాహ మప్పుడు పైకుబికినది. బంగా ళీలలో గొప్పమతసంస్కర్తలు మతప్రచారకులు చాలమంది యుదయించిరి; పూర్వపుచైతన్యాదులే కాక, బ్రాహ్మమత స్థాపకులగురాజా రామమోహనరాయి, మహర్షి దేవేంద్రనాథ టాగోరు వగైరాలును, సనాతనభావుడై ఉదారుడై భక్తిరస మూర్తియైన రామకృష్ణపరమహంసయు, ఉపనిషత్సారమును హిందూమతసిద్ధాంతములను ఖండాంతరములందు గూడ వెద జల్లిన వివేకానందస్వామియు, కుసుమహరనాథాదులును, వంగీ యులే. ఈశతాబ్దిలోను అక్కడరాజకీయముల నడిపించిన రవీం

ద్ర నాథుడు, విపినచంద్రపాలు, అరవిందఘోషు గూడ మతో
త్సాహులే. వారిగ్రంథాదుల జదివినమీాదట, తానునొకసన్యా
సియై ఆధ్యాత్మికజీవితమే గడపవలెనని తోచి, సుభాషు కాలే
జీచదువుకట్టిపెట్టి, సమ్మర్దయుతమగు కలకత్తాను వదలెను.
విశ్రాంతి భక్తి వాతావరణము నుండు పుణ్యక్షేత్రములందు మ
హనీయులగు గురుస్వాములుందురు; వారిసాన్నిధ్యము సంపా
దించి, గురూపదేశమొందుదమని నిశ్చయించి, ఆతడు ప్రసిద్ధ
తీర్థస్థలములగు కాశీ, హరిద్వారము, బృందావనము మున్నగు
క్షేత్రములకుబోయి, అక్కడ ప్రసిద్ధులైన సన్యాసులను కొంత
కాలము సేవించెను; కాని, అందుచేతనతనిహృదయావేదన తగ్గు
టకుబదులు హెచ్చినది. ఆ 'మహాగురువు' లందాంతర్యముగ
ఆధ్యాత్మికపుఘనత కనుపడలేదు. వారాడంబరులై రాజవైభవ
ముతోనుండిరి; ఆసాధువేషముల కంతర్గుణములు సమన్వయించ
లేదు. భౌతికలోలత, ద్రవ్యకాంక్షగూడ, వారికి లోలోపల ను
న్నట్లు, ఆత్మశుద్ధి లేనట్లును, ఆకుశాగ్రబుద్ధికి తట్టినది. సుభాషు
స్వచ్ఛమనస్కుడు; అతనికట్టి భేషజములు నిష్టముకావు.
ఆసన్యాసులడంబము, విషయలోలత, అతనికివెగటు గల్గించెను.
కనుక, ఆతడాపరిసరములవిడచి, తూర్పుగపయనమై, మరల
కలకత్తాచేరెను. సన్యాసిపద్ధతిలోదిగి ఏకాంతముగ నున్నంత
మాత్రమున మోక్షముగల్గదనియు, లోకసేవ జేయుటే నిశ్రే
యసముకు సరియైనమార్గమనియు తోచెను. అంతట దృష్టిని

మరల మార్చుకొని, ఆతడు కాలేజీలో యథాప్రకారము చదు వందుకొనెను; ఇటీవల తనసంచారములో దాటిపోయిన పాఠములను గ్రహించెను; తనయేకాగ్రతవలన 1915 లో జరిగిన ఇంటర్మీడియేటు పరీక్షలో 1 వ తరగతిలోనే కృతార్థుడాయెను.

తరువాత సుభాషు ప్రెసిడెన్సీకాలేజీలోనే ఫిలాసఫీఆనర్సుకోర్సు(=తత్వశాస్త్రము నున్నతవిద్యావిధానము)లో నభ్యసించుటకారంభించెను. అతడు సంస్కృతములోను విద్వాంసుడు; తర్క వేదాంతములందు ప్రత్యేకకృషి చేసెను. కాని యీలోగా నందుకొక విఘ్నముగలెను.

కలకత్తానగరము విద్యార్థులకు పెద్దకేంద్రము. ఆవిద్యార్థిబృందములలో క్రమముగ జాతీయభావము వ్యాపించుచుండెను. అది ప్రపంచమహాయుద్ధపు సమయము. దేశమంతటను-ముఖ్యముగ యువకులలో—చిత్రవిచిత్రములగు క్రొత్తభావముల ప్రచారమారంభించెను; ఆందోళనము, ఉద్రేకము, అధికమైయుండెను. పాశ్చాత్యుల ప్రచారమువల్లను జాతివిద్వేషము హెచ్చెను. ఈవిప్లవసమయమందు భారతీయ విద్యార్థులలో స్వాతంత్ర్యభావములను విప్లవతరంగములును వ్యాపించకుండ జేయుటకై, మనప్రభుత్వము చాలనిర్బంధముల దెచ్చిపెట్టిరి; వారు రాజకీయములందేరీతిగను కల్పించుకొనకూడదని, మిక్కిలి విధేయులై యుండవలెనని, విధించిరి; తెల్లవారి యాధిక్యమును ప్రదర్శింపజూచిరి. కాని కొందరు స్వతంత్రవిద్యార్థులందుకు లోబడక తమఆత్మగౌరవమును రక్షించుకొనబూనిరి.

ఈస్థితిలో, కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజిలో చరిత్రోపాధ్యాయుడగు 'ఓటెన్' అను ఆంగ్లేయుడు భారతీయులు బ్రిటిషువారికి తీసిపోవుదురని, అనాగరికులని, బహిరంగముగ తృణీకరించుచుండెను. అది విద్యార్థుల మనస్సునకు కష్టముగనుండెను. సుభాషు ఈవిద్యార్థులనాయకుడై, స్వాతంత్ర్యోద్యమ మందభిమానముగలిగియుండెను. ఆప్రభుత్వకళాశాలలలోని హైందవోపాధ్యాయులకన్న, అక్కడి ఆంగ్లేయు లెక్కువ ప్రజ్ఞావంతులు కారు. కానివారికి జీతములు అధికారములు నెక్కువగ నుండుటేగాక, గర్వము అహంభావముగూడ హెచ్చుగ నుండెను. ఈ ఓటెను దొర చాల గర్విగ నుండుట అసహ్యముగనుండెను. వేలకొలదిమైళ్ళనుండి పొట్టపూజకై దయచేసి బీదభారతీయులనుండి వచ్చు పన్నుల బాపతుసొమ్ము దిని జీవించు ఈదొరలకింత కృతఘ్నతయుండుటేల, వారికి స్వరూపజ్ఞానము కల్గించుటెట్లు? అని కొందరు విద్యార్థులాలోచించుచుండిరి.

ఈస్థితిలో ఒకరోజున ఆ 'ఓటెను' దొర తనక్లాసు ప్రక్కను విద్యార్థులు శబ్దముచేయుటచూచి సహింపలేక, వారలను 'పందులమంద'వలెనున్నారనెను. అంతట నావిద్యార్థులుద్రేకమొంది, అప్పుడు మేడమెట్లు దిగుచున్న ఓటెనుగారికి చేతులతో గట్టిగ దక్షిణనిచ్చి, మెట్లనుండి క్రిందకు దొర్లించిరి. వారిలో సుభాషునుండెనట. అప్పుడు కాలేజిప్రిన్సిపాలు

(=అధ్యక్షుడు) అగు జేమ్సుదొర సహజముగ ఓటెను పక్షమే వహించి, వెంటనే విద్యార్థులందరిని గెంటించివేసి, కాలేజిని కట్టివేయించెను. తరువాత యూనివర్సిటీ అధికారులు పెద్దవిచారణజరిగించగా, 'ఓటెను'గారి ప్రవర్తన అపసవ్యము విద్యార్థులకు కోపకారణము నైనదనియు, కాని యావిద్యార్థులు స్వతంత్రించి గురువుగారినట్లు చేయకూడదనియు, తేల్చిరి. అంతటితో 'ఓటెను' గారు ఉద్యోగమునకు సెలవుతీసుకొని, స్వదేశమునకు దయచేసిరి; మరలరాలేదు. ఈతగాదాలో చిక్కిన విద్యార్థుల నధికారులు కాలేజినుండి తొలగించిరి; వారికిసుభాషు నాయకుడని తోచి, అతనిని రెండేండ్లవరకే కాలేజిలోను చేర్చుకొనకూడదని, ఆకాలేజిలోని కెన్నడును రానీయకూడదనియు, నియమించిరి. ఇట్లీగడబిడవలన సుభాషు రెండేండ్లు కాలేజిచదువు లేకపోయి, అప్రతిష్ఠకును పాలాయెను.

ఆరెండేండ్ల అజ్ఞాతవాసమైనమీదట సుభాషు మరలచదువ యత్నించెను. కాని, ఏ కాలేజి అధికారులును చేర్చుకొనరైరి. అప్పుడు కలకత్తా విశ్వవిద్యాలయపు వైస్‌చాన్సెల్లరు (=ఉపాధ్యక్షుడు) అశుతోష ముఖర్జీ అనుమహనీయుడు; ఆయన హైకోర్టుజడ్జియగుటేగాక, అనేక శాస్త్రములందు విద్వాంసుడు, ఉదారుడు, స్వతంత్రభావుడు; ఆయనకు విద్యార్థులపైగల సానుభూతి అపారము. 'సుభాషు ధీమంతుడు, ముందు ఘనుడై దేశసేవకుడు కాదగును, అట్టివానిజీవితము వ్యర్థమగుట మనదేశ

మంతటికిని నష్టకరము అనియోచించి, సుభాషును కాలేజీలలో చేర్చుకొనవలెనని ఆయన గట్టిగ శిఫారసుచేసెను. ఆసహాయము వలన, 1917 లో, కలకత్తాలోని 'స్కాటిష్ చర్చెస్ కాలేజి' అను క్రైస్తవమిషను కళాశాలలో సుభాషు బి. ఏ. క్లాసులోనే చేరి, మరల చదివెను.

ఇట్లు ద్రేకఫలముగ రెండేడ్లు చదువుచెడినను, మరల బాగుగనే జ్ఞానమార్జించి, అతడు 1919 లో బి. ఏ. ఆనర్సులో ఉత్తమశ్రేణిలో కృతార్థుడాయెను; తత్వశాస్త్రమందు మంచి ప్రజ్ఞావంతుడని ప్రసిద్ధిగాంచెను.

---

# 3. ఐ. సి. ఎస్. చదువు.

ఇక ముందుసంగతిగూర్చి చర్చవచ్చెను. అతడు ఇంగ్లండుకు వెంటనేపోయి ఐ. సి. ఎస్. పరీక్షకు యత్నింపవలెనని తండ్రి పట్టుబట్టెను. సుభాషు కది నచ్చలేదు. ఐ. సి. ఎస్. పరీక్ష చాల కఠినము. అందుకై గొప్పమేధావులును ఇంగ్లండులో నొకటి రెండేండ్లు గొప్ప యుపాధ్యాయులక్రింద తర్ఫీయతు అగుదురు. కాని సుభాషుకట్టివ్యవధి లేదు; ఇక కొద్దినెలలలోనే ఆపరీక్షసమయము; కనుక, వెళ్ళినను నెగ్గుట కష్టము. మరియు సుభాషు కధికారాశలేదు. ఐ. సి. ఎస్. వారందరుదు కలెక్టరుగనో జడ్జిగనో ఉద్యోగము చేయవలెను. అందుండి తనకిష్టమగు ప్రజాసేవ జేయుట కెంతవరకవకాశముండునో! 'అందు నెగ్గకున్నను ఇంగ్లండులో బారిష్టరుపరీక్షకో మరొకదానికో చదువవచ్చును; కనుక వెళ్ళు' మని అన్నలు సూచించిరి. ఆ కొడు కెట్టిపరీక్షలోనైన కృతార్థుడగునని జానకీనాథుడు గట్టిగనమ్మి, తొందరచేసెను. సుభాషు కేమిచేయుటకును తోచలేదు. ఇంతలో మిత్రుడగు నొకసాముద్రికుడువచ్చి బలవంతముగ సుభాషుచేయి చూచి, అతడుతప్పక ఐ. సి. ఎస్. పరీక్షలోనెగ్గునని చెప్పెను; కాని, వెంటనే పెదవివిరచెను. అదేమని తండ్రియు సోదరులు నడిగిరి. అతడునెగ్గుట నిశ్చయమే, కాని అతడు విరాగియగును; సంసారము, లౌక్యవర్తనము, వీటిధోరణి ఆహాస్తముండదు కన

బడను; అనిఆసాముద్రికు డనెనట. ఆతుదివాక్యమే పిచ్చిజ్యోతిషముగ నున్నదని తక్కిన అందరును నవ్వివేసిరి. సుభాషుకు సాముద్రికమం దసలేనమ్మకము లేదు. కాని తండ్రికి దానిపైన గట్టి నమ్మకము. అతడు తక్షణమే బలవంతముగ సుభాషును ప్రయాణముచేసి, 1919 సం॥ సెప్టెంబరులో ఇంగ్లండుకంపెను. వ్యవధి తక్కువగనున్నను ఆకొద్దినెలలును సుభాషు చదివి, లండనులో ఐ. సి. ఎస్. పరీక్షకు హాజరాయెను. అతడు పరీక్షలో వ్రాసినది తనకు తృప్తిగ తోచలేదు. కాని అతనిప్రతిభ అద్భుతము. ఐ. సి. ఎస్. పరీక్ష పోటీపరీక్ష. అందు గణితవిజ్ఞానములందు ప్రవీణులై అందుబాగుగ పరీక్షనిచ్చువారికి సౌకర్యము హెచ్చు. సుభాషువలె తత్వశాస్త్రిదులే గ్రహించువా రెంత బాగుగవ్రాసినను,పూరామార్కులురావు. కాని సుభాషు ఆపరీక్షలో చాలమంది ఆంగ్లయువకులనుగూడ ఓడించి, మొత్తము మీద నాల్గవవాడుగను, హైందవులలో మొదటివాడుగను, బాగుగ కృతార్థుడాయెను. ఆపరీక్షలో నితని కాంగ్లభాషా వాఙ్మయములందు తక్కిన అందరికన్నను హెచ్చు మార్కులు వచ్చెను. ఆంగ్లమం దాంగ్లేయులందరిని (కొద్దినెలలక్రిందనే యింగ్లండుకువచ్చిన) భారతీయయువకు డిట్లోడించుట అందరికి నాశ్చర్యము గల్గించెను.

అంతట సుభాషు ఐ. సి. ఎస్. కోర్సు నియమముప్రకారమక్కడ సుమారొకయేడాది గుర్రపుస్వారి న్యాయశాస్త్రము

వర్గైరాలభ్యసించి, వాటిలో బాగుగ కృతార్థుడాయెను. ఈ లోగా కేంబ్రిడ్జి యూనివర్సిటీలో మనశ్శాస్త్రనీతిశాస్త్రము లందు బి. ఏ. పరీక్షనిచ్చి, అందుకు 'ట్రైపస్' అనగా హెచ్చు గుగౌరవస్థానమును పొందెను.

ఇంగ్లండులోగూడ సుభాషు కాలేజి విద్యతోనే సరిపెట్టుకొనలేదు. మనదేశపురాజకీయస్థితి యెట్లున్నదో ఆతడు పత్రికలనుండి ఎప్పటికప్పుడు గ్రహించుచుండెను. కాని బ్రిటిషు పత్రికలలో మనజాతీయవిషయములగూర్చి సరిగ వివరముల దెలుపరు. కనుక, ఆతడు మనదేశమందలి తనమిత్రులకువ్రాసి, ఉత్తరములద్వారా సంగతులన్నిటిని తెలుసుకొనుచుండెను. ఇట్లుపెరుగు తనజాతీయతాంకురముకు కేంబ్రిడ్జిలోనే ఇంకొక దోహదముగలెను. శ్రీ తిలకుగారప్పుడు జాతీయతా ప్రచార ముకును 'షిరోల్' పైన తనకేసుకొరకును ఇంగ్లండుకువచ్చిరి. అప్పుడాయన కేంబ్రిడ్జికినివిచ్చేసి, విద్యార్థుల నుద్దేశించి "మీరం దరునిక్కడ విద్య పూర్తిచేసి స్వదేశముకు చేరుదురు. అప్పుడు మీరుదోగ్యమోహములో మునుగకుడు; మీయంతరాత్మ చోదనకు భిన్నముగ నడువకుడు; మీ ప్రజాక్షేమముకు, మీ దేశస్వాతంత్ర్యముకు, మీశక్తులవినియోగింపుడు". లోకమాన్యు ని యీ హితోపదేశము యువకుడగు సుభాషుహృదయమున గట్టిగ నాటుకొనెను. దానిఫలము వెంటనే కల్గెను.

ఐ. సి. ఎస్. పరీక్షలో పూర్తిగ తేరినందున సుభాషును ప్రభుత్వమువారు తమ సర్కారుకుద్యోగిగ జేర్చుకొనిరి;

ఆయనకోరికప్రకారము, ఈదేశమునకు వచ్చినవెంటనే బీహారు ఒరిస్సారాష్ట్రమందు నియమముప్రకార మసిస్టెంటు కలెక్టరుగ పనిచేయుటకు నిర్ణయించిరి. అప్పుడాతని ఆత్మశుద్ధికి త్యాగమునకు గొప్పపరీక్ష వచ్చినది. ఐ. సి. ఎస్. ఉద్యోగులకు (మనదేశమందేర్పడు తక్కినఉద్యోగులవలెకాక) ప్రత్యేకపుహక్కులును, హెచ్చుజీతములును, సాలీనా రూలుప్రకారము మంచియభివృద్ధియు నుండును. ఆప్రకారమాయుద్యోగములో జేరుటకు ముందుగా లండనులోనే వారిలో ప్రతివారికిని బ్రిటిషుప్రభుత్వముతో 'కవెనెంటు' (= ఖరారునామా) జరుగును. అందొకషరతు 'నేను రాజభక్తిగలిగి బ్రిటిషుపాలితమగు భారతప్రభుత్వమునకు క్షేమకరముగ వర్తింతు'నని. ఈ షరతును ప్రతి ఐ. సి. ఎస్. ఉద్యోగియు మామూలు సంగతిగ ఒప్పుకొని, అందుపైన సంతకముచేయును. అదితప్పదు. అందుకిదివరకేయుద్యోగియు ఎప్పుడును ఆక్షేపణచెప్పలేదు. కాని సుభాషచంద్రబోసు పైవాక్యములో "భారతప్రభుత్వమునకు" అనుటకు బదులు "భారతజనులకు" అనిమార్చి సవరణచేయవలెననెను; "అట్లు సవరణచేయవీలు లేదు, ఆమతలబు చిరకాలముక్రింద ఖాయపర్చబడి, అప్పటినుండి అమలులో నున్నది; ఆప్రకారమే దస్కతుచేయుము. ఇందుకొత్తవి ఆక్షేపణార్హములేమియు లేవు, అని యాధికారులు వివరించిరి. కాని సుభాషు పట్టుపట్టెను; "నేను నాదేశప్రజలకేది క్షేమకరమో ఆపనులనే

జేయుదు గాని, ప్రభుత్వలాభముకై ప్రజలకుహాని గల్గించు పనుల జేయను" అనిస్పష్టపర్చెను. ఇట్టిపేచీ యిదివరకెన్నడును లేదు. కనుక అధికారులకోరెక మీాద కాలేజిప్రిన్సిపాలువగైరాలు "అందుతప్పేమియు లేదు. మామూలుపత్రముపై దస్కతుచేయకుండుట పిచ్చిచేష్ట" అని తొందర చేసిరి. కాని సుభాషు తొణకలేదు. "ఏమైననుసరే; నాకీయుద్యోగము పోయినను సరే, రాజసేవకన్న ప్రజాసేవయే ముఖ్యము. ఈ భారతప్రభుత్వము బ్రిటిషువారిది. వారికిని భారత ప్రజలకును ప్రయోజనములలో సంఘర్షముండి తీరును. అప్పుడు నేను ప్రజానుకూలముగనే చేయుదును. నా అంతరాత్మప్రేరణకు వ్యతిరేకముగ చేయను." అని, నిరాకరించెను. అట్టి సమస్యకు యువకుఁడీసరకు తగాదావల్ల ఉద్యోగము వదలుట ప్రభుత్వమునకును ఆయుపాధ్యాయులకును చాలకష్టముగదోచినది. వారంతట "కవెనెంటు పైన రివాజుప్రకారము దస్కతు చేయునట్లు మీాకొడుకుకు తొందర గల్గించవలెను" అని సుభాషుతండ్రికి 'కేబిలు' (=నీటితంతి) వార్తనంపిరి. జానకీనాథుఁడును శరచ్చంద్రుఁడును "ఆదస్కతు పట్టిలాంఛనమువంటిది. నీవట్టికాకితముమీాద దస్కతుచేసినను, ప్రజాహిత ప్రకారమే ఉద్యోగ కార్యముల జేయవచ్చును; పెద్దసమస్యగ నెంచక వెంటనే దస్కతుచేసిరమ్ము" అని తంతి నంపిరి. కాని అట్లు దస్కతుచేసినమీాదట ఉద్యోగములో ప్రభుత్వాజ్ఞలమీారినయెడల అది అసత్యవర్తనమగును. కనుక

ఏమిచేయదగును? అని సుభాషు కలకత్తాలోని చిత్తరంజన దాసుగారికి తంతిబంపెను. అప్పుడే మనదేశమందు అసహాకారము తీవ్రమైనది; దాసుగారు ప్లీడరీవదలి ఆయుద్యమములో జేరుచుండిరి. "నీఅంతరాత్మతోఁపించు ప్రకారమే చేయుము." అని దాసుగారుజబాబుతంతినంపిరి. అంతట, ఎవరెన్ని చెప్పినను ఆషరతుండు 'కవెనెంటు' పైన సంతకముచేయనని సుభాషు తేల్చివేసెను. "ఏసందర్భములోను ఆషరతుమార్చము; నీవుద్యోగము మానినను సరే" అని అధికారులు స్పష్టపర్చిరి. "అనగాం, ఐ. సి. ఎస్. లందరికిని స్వదేశభక్తికన్న ఆంగ్లరాజ్య భక్తియే ముఖ్యమన్నమాట. అట్టి ఉద్యోగ మెంత గొప్పదైనను, అది నాకెంతమాత్రమును వద్దు. ఆషరతు మార్చరు; కనుక, నే నీయుద్యోగముకురాను." అని అధికారులకు సుభాషు వ్యక్తపర్చి, దుర్లభమై ఎంతోవ్యయప్రయాసలతో సంపాదించిన 'స్వర్గజనితమగు ఉద్యోగమును* ప్రజాసేవకై వదలి, వెంటనే బయలుదేరి మాతృభూమిని చేరెను.

---

* The Heaven - born Service.

# 4 పూర్వరంగము.

---

ఇక జాతీయోద్యమముందు సుభాషు చర్యలను గమనించవలెను. దానికిముందు దేశపుపూర్వచరిత్రను స్మరింతము.

పూర్వ మీదేశమును హిందూరాజులు పాలించుచుండిరిగదా! మధ్యకాలమందు కొందరు ముస్లింవీరులు పర్షియా ప్రాంతమునుండివచ్చి, ఇక్కడ రాజ్యముస్థాపించిరి. అప్పుడిక్కడి కొందరు ముస్లిం మతస్థులైరి. ముఖ్యముగ వంగరాష్ట్రములో నవాబుల పాలనలో ఇస్లాంప్రచారపుధాటివలన ప్రజలలోచాలమంది యట్లే చేసిరి. కాని, ఆనవాబులీదేశీయులై, ఈప్రజల కష్టసుఖములు తమవిగ జూచుకొనిరి.

తరువాత, 18 వ శతాబ్దిలో, యూరపునుండి పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి, బ్రిటిషువర్తకులువచ్చి, మనరాజులసమ్మతిమీద నిక్కడవ్యాపారము సాగించిరి. క్రమముగా వారికి ద్రవ్యకాంక్షకు రాజ్యకాంక్ష తోడైనది. అప్పటికి ఔరంగజేబురాజనీతిఫలముగ, 17 వ శతాబ్దిలో మొగలాయిరాజ్యము విచ్ఛిన్నమైనది; దృఢమగు కేంద్రప్రభుత్వములేదు; అంతఃకలహములు హెచ్చెను; అందులో ఫ్రెంచి బ్రిటిషుకంపెనీలవారు యుక్తితో చేరియొకపక్షమువహించి, ఆకలహముల పెంచుచుండిరి. మనరాజులు తమకక్షలే ముఖ్యముగనెంచి, విదేశీయులగు ఫ్రెంచి బ్రిటిషువారల సాయము తీసుకొనిరి. తమ సోదరకలహ

ముభయులకును దేశమంతటికిని అనర్థకమని, ఆరాజులప్పుడు గ్రహించలేదు. ఇక్కడ బొబ్బిలి విజయనగరం రాజులమధ్యను నైజాముకుమనరాజులకును కలినట్లే, బెంగాలులోను అంత ర్యుద్ధములు కలిగినవి; తుద కాయారాజులకు భ్రష్టతయు, మన దేశీయులందరికిని పరాధీనతయు, కల్గినవి. ఫ్రెంచిబ్రిటిషులమధ్య తగవులలో, నౌకాబలముచే బ్రిటిషువారే ప్రబలులైరి; ఇట్లు మనదేశమంతటను క్రమముగా బ్రిటిషుసామ్రాజ్య మేర్పడినది. 1857 లో కొందరుసిపాయీలు బ్రిటిషుకంపెనీపైన తిరుగబడి పోరినారు. కాని అందుకు ప్రజలు తోడ్పడలేదు. మరియు, మన దక్షిణప్రాంతీయులును, నిజాముగారును, పంజాబులో సిక్కులు వగైరాలును, అందు బ్రిటిషుసేనలకే తోడ్పడిరి. అందువలన ఆవిప్లవమణగిపోయి, బ్రిటిషుపాలన మనదేశమందు వేరుపాతు కొన్నది. అప్పుడు కంపెనీని తప్పించి బ్రిటిషుప్రభుత్వమువారే మనపాలన నారంభించినారు. కలకత్తా, మద్రాసు మొదలగు రాజధానులం దాంగ్లపాఠశాలలేర్పడినవి. వాటిద్వారా ఆంగ్ల విద్య మనదేశమందు వ్యాపించినది. అందు, ఉత్తరదేశమంతట ను బంగాళీలు ప్రముఖులైరి. వారికి బుద్ధికుశలత, ఉత్సాహము, ఉద్రేకమును, హెచ్చు. అంతకుముందక్కడి నవద్వీపాదులందు సంస్కృతవిద్య హెచ్చినట్లే,19 వశతాబ్దిలో కలకత్తా ప్రాంతమం దాంగ్లవిద్యయు, పాశ్చాత్యనాగరికతయు, బాగుగ వ్యాపించినవి. బెంగాలుప్రభుత్వముకే గాక, దేశమంతటి ప్రభుత్వముకును,

1911 సం॥వరకు కలకత్తాయే రాజధాని. కాని అందు కొన్ని సామాన్యపు ఉద్యోగములే మనదేశీయులకుండెను. గొప్ప అధికారము హెచ్చుజీతములుగల ఉద్యోగములన్నియు బ్రిటిషు వారే వహించిరి; విదేశవ్యాపారమును, కలకత్తా ప్రాంతపు గొప్పపరిశ్రమలనుగూడ, వశపర్చుకొనిరి. కలకత్తా ప్రాంతమునందును పెద్దజనపనారఫాక్టరీలను, గొప్పకార్ఖానాలను బాంకులు వగైరాలను స్థాపించి, సాలీనా కోట్లకొలది రూపాయల ద్రవ్యమునార్జింపసాగిరి. ఢాకాయున్న గుచోట్లను మనప్రాంతమందును బట్టలనేత మొదలగు మనదేశీయపరిశ్రమలను అంతకు పూర్వము నవాబులు రాజులువృద్ధిపొందించిరి. కాని బ్రిటిషువారి ఆధిపత్యమందవి, పోషణపోయి, క్షీణించినవి. బ్రిటిషువారు మహాయంత్రములలో సమృద్ధిగ తయారైన సరకులనుదెచ్చి, చౌకగఅమ్మి, మనదేశీయ పరిశ్రమల నశింపజేసినారు. ఇక్కడి ప్రభుత్వమును వారికి తోడ్పడినది. వృత్తులుపోయి, మనజనులు బాధపడుచు, అసంతృప్తులైరి.

ఈస్థితిలో మనదేశమునకు కర్జనుప్రభువు గవర్నరుజనరలుగ దయచేసెను. ఆయనగర్వి, నిరుగ్రుడు; బ్రిటిషుసామ్రాజ్యపుపాశములను మనపై నింకను బిగించెను; భారతీయులను దూషించెను. ఆయనవంగరాష్ట్రమును 1905 లో రెండు భాగములుగ విభజించెను; ఆప్రజలువద్దన్నను మానలేదు. అప్పుడే (1904-05 లో) జరిగినయుద్ధములో రష్యాపాలకులగు యూర

పియనులను ప్రాచ్యులగు జపానీయులోడించిరి. ప్రాచ్యులలోను సహజసమర్థత కలదని స్పష్టమై, ముందుగా బెంగాలులోను, అక్కడనుండి మనదేశమంతటను, జాతీయోత్సాహము వ్యాపించినది. బెంగాలులో సురేంద్రనాథబెనర్జీ, అరవిందఘోషు, పాలు, బొంబాయిలో తిలకు మున్నగు నాయకు లుద్రిక్తులై, జాతీయోద్యమమును పురికొల్పిరి. ఆయుద్యమము నణచుటకు సర్కారువా రింకనునిరంకుశమగు చర్యలారంభించిరి. ప్రజల బాధించుఉద్యోగుల జంపుటే స్వాతంత్ర్యసంపాదనకు సాధనమని, రష్యా మొదలగు పాశ్చాత్యదేశములలో అధికారులపై బాంబులు వగయిరాలు వేయుచుండిరి. ఆసంప్రదాయ మవలంబించి కొందరు (ముఖ్యముగ బెంగాలులో) మనయువకులును అట్టి భయానకచర్యలు జరిపిరి. కాని అందువల్ల లాభము రాలేదు. సరి కదా, ప్రభుత్వపుగూఢచారు లావిప్లవకారులను వారితోపాటు నిర్దోషులనుగూడ పట్టుకొని, బాధించిరి. ప్రభుత్వమువారు వారిని శిక్షించి, అండమానుదీవులకంపిరి. రాజద్రోహసభల చట్టము, అచ్చుకూటములచట్టము మున్నగు కఠినశాసనములు కొత్తగబెట్టిరి; వంగభంగమునురద్దుచేసి, కొన్నిసంస్కరణలజేసి, కొందరు మితవాదుల నాకర్షించిరి.

ఈస్థితిలో 1914 లో మహాయుద్ధము వచ్చినది. విప్లవ భయమున సర్కారువారు నిరోధములహెచ్చించిరి; విచారణ లేకుండ చాలమంది ననుమానమున జైలులోనుంచిరి. కానియుద్ధ

మున వారు గెల్చుటకు మనసాయ్యు జనము నెక్కువగ అవస రమాయెను. యుద్ధానంతరమున ఈదేశమందును ప్రజాయత్త మగుపాలన బెట్టెద మని వారుప్రచురించిరి. అంతట మనదేశీ యులు ధనదేహాదులను ధారాళముగ నాయుద్ధమందర్పిం చిరి. ఎట్లో, బ్రిటిషువారే గెల్చిరి. 1918 నవంబరుకుయుద్ధ మంతమైనది. కాని బ్రిటిషువారు మాట నిల్పుకోలేదు. వారు 1919 లో నిచ్చిన క్రొత్తరాజ్యాంగమందు ప్రజలకధికారము లేదు. కొద్దిమందికిమాత్రము పెద్దజీతములయుద్యోగములు, శాస నసభలసభ్యత్వమును దొరికినవి. వాటివల్ల ప్రభుత్వవ్యయమును, అందుతో ప్రజలపైన పన్నులును, హెచ్చినవి. ఆర్థికముగను రాజ కీయముగను జనులబాధలు హెచ్చినవి. అంతటసహజముగ దేశ మం దశాంతి, ఆందోళన, కలినవి. వానినణచుటకు 'రౌలటుచట్ట' మనుపేర వింతరకపు క్రొత్తనిర్బంధశాసనమును ప్రభుత్వము వారుపెట్టిరి; కాని నెదిర్చినవారికి క్రొత్తరకపుశిక్షలబెట్టిరి. రాజుతలచిన దెబ్బలకుకొదువలేదు గదా !

'మితవాదులు స్వార్థపరులు, పిరికివారు' అని నిందించిన ను, మనజాతీయవాదులును అప్పటికివట్టి ఆందోళననే చేయుచుం డిరి. వారికిని కార్యకారియగు ప్రణాళిక లేదు. 'మంత్రములకు చింత కాయలురాలవు'. ఈయాందోళన, దూషణ, ఎంతజరిగినను స్వరా జ్యమురాదని గ్రహించి, కొందరు తెగించినయువకులింకనుకుట్ర లజేసి బాంబులవేయుచు, భయానకచర్యల జేయుచుండిరి. కాని

అందువలనవారికిని దేశమునకునుగూడ లాభములకు బదులు నష్టమేకల్గుచుండెను.

ఈస్థితిలోమనదేశప్రజలకుకొత్తనాయకుడేర్పడి,కొత్తజాతీయవిధానమునుబెట్టెను, ఆయనయే గాంధిమహాత్ముడు.

'మనపరాధీనతకు చాలవరకుకారణము మనలోలోపములే. వానినిపోగొట్టి ప్రజల అంతశ్శక్తిని,సంఘీభావమును, వృద్ధిచేయవలెను;అప్పుడుస్వరాజ్యమువచ్చితీరును' అనుసంగతి గాంధిమహాత్ముడు కనిపెట్టెను. ఆయనకార్యశూరుడు. మనపాలకులగు తెల్లఉద్యోగులు వ్యక్తులుగదుష్టులుకారు; వారిప్రకృతియు మానవప్రకృతియే. వారిసామ్రాజ్యతత్వమే దుష్టము.దానికిబలమిచ్చు సంస్థలకు మనము తోడ్పడినంత కాలమే అవివృద్ధియగును. వాటికిమనసాయముచేయుటను మానివేయవలెను.

ఇదే గాంధిగారి 'నాన్ కో ఆపరేషను' (=అసహాకార) సిద్ధాంతము. అందుకై మనలో నిగ్రహము నికమత్యమును కావలెను. ఇప్పుడు మనసంఘములోనున్న పంచముల అస్పృశ్యత, విదేశవస్తుధారణ,సాంఘికకలహములు వగైరాలు మనలనన్నివిధములను దుర్బలులుగ జేయుచున్నవి. వానినితొలగించి, మనఅంతశ్శక్తిని వృద్ధిజేసుకోవలెననియు గాంధిగారేర్పర్చినారు. ఇదే నిర్మాణకార్యక్రమము. దాని నములుజరిపితిమా, విదేశీయులబలము తగ్గును. ఖద్దరు వగైరా గృహపరిశ్రమల వృద్ధిజేసి, వానినే మనమువాడి వాటికి ప్రోత్సాహ మీయవలెను.

అప్పుడు గ్రామములందుజనులు తిండి బట్ట గలిగి, స్వతంత్రు లగుదురు. ఈకొత్తసిద్ధాంతములను గాంధిగారు దేశభాషలందు ప్రచారముచేసినారు. ఐకమత్యబోధకై, సత్యాగ్రహాదీక్షను హారతాళపద్ధతినిగూడ పెట్టినారు. (ఇవి దక్షిణాఫ్రికాలో నిదివరకాయన పెట్టగా, ఫలించినవి.)

ఆయన 1919 లో సత్యాగ్రహ హారతాళాములనారంభించగనే దేశమంతట నుత్సాహ ముబికినది. అంతట ప్రభుత్వము వారు బెదరిరి; దాని నరికట్టుటకు, ముఖ్యముగ యోధులుందు పంజాబుకెక్కకుండ జేయుటకు, ప్రభుత్వము వారు నిశ్చయించిరి; అక్కడ దౌర్జన్యచర్యల జేసిరి. జలియన్‌వాలాబాగు హత్యలు, జనులు ప్రాకిపోవలెనను అమానుషపు హుకుములు, దారుణదండనలును జరిగించిరి; బయటిప్రజానాయకులను కొన్ని నెలలు పంజాబుకు రానీయరైరి. తరువాత కాంగ్రెసువారు విచారణచేసి ఆదారుణచర్యలలో తప్పు ప్రభుత్వోద్యోగులదే అని నిర్ధారణజేసిరి. కాని ప్రభుత్వమువారు ప్రజలే తప్పుచేసిరనిరి. అప్పుడు 1920 లో గాంధిగారు అసహకారము తీవ్రముగ నారంభించిరి. 'శాసనసభలు, కోర్టులు, ప్రభుత్వోద్యోగములు ప్రభుత్వపు బిరుదులును, సర్కారువారి బలగౌరవములను హెచ్చించును. కనుక వానినన్నిటిని ప్రజాక్షేమపరులందరును వదలివేయవలెను' అని ఆయన బోధించిరి. ఆప్రకారమాయన 1920 సెప్టెంబరులో కలకత్తాలోను డిసెంబరులో నాగపురము

లోను, కాంగ్రెసులో తీర్మానముగూడ జేయించిరి. అంతటితో దేశపు పూర్వస్థితియాంతయు మారిపోయినది. ప్రజలలోను కొందరు నాయకులలోను క్రొత్త దృక్పథ మేర్పడినవి. వైస్రాయిగారి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్లరు (=మంత్రి) అగు సర్ శంకరరన్ నాయరు మున్నగువా రుద్యోగములను, రవీంద్రాదులు బిరుదములును, దాస్, నెహ్రూ, ప్రకాశం మున్నగు చాలమంది ప్రముఖులు ప్లీడరీని, ఎందరో మెంబర్లు శాసనసభ్యత్వమును, చాలమంది విద్యార్థులు స్కూళ్ళను, వదలివేసిరి. తగవుల పరిష్కారముకు పంచాయతీసంఘములను విద్యార్థుల జ్ఞానాభివృద్ధికి జాతీయవిద్యాలయములను నాయకులు స్థాపించిరి. చాలమంది అప్పటిపద్ధతుల మార్చుకొని, సామ్యజీవనముకు, గ్రామ్యపద్ధతులకును అలవడిరి.

---

# 5. అసహాకారము.

1921 ఆరంభమునందు సుభాషచంద్రు డింగ్లండునుండి దిగిస్వదేశము చేరు నప్పటికి దేశస్థితియిట్లున్నది. సుభాషు ఐ. సి. యస్. ఉద్యోగము వదలినత్యాగ మితరులకుమార్గ దర్శకమైనది. అది అసమానము. పూర్వము సురేంద్రనాథ బెనర్జి ఐ. సి. ఎస్. నుండి విరమించెను; కానిదానినాయన స్వయముగ వదలుకోలేదు; సర్కారే తొలగించిరి. అరవింద ఘోషును ఐ సి.ఎస్. పరీక్షకు వెళ్ళెను. కాని ఆయన ఐ.సి.ఎస్. ఆరంభపరీక్షలో బాగుగ 'ప్యాసై'నను, గుర్రపుసవారిలో తప్పిపో యినందున, ఐ.సి.ఎస్. అంత్యపరీక్షలో తప్పిపోయెను. సుభాషు మాత్రము పరీక్షలన్నిటిలో కృతార్థుడై, ఉద్యోగములో జేర బోవుస్థితిలో దేశభక్తివలననే ఉద్యోగమును మనఃపూర్వక ముగ మానివేసెను. పూర్వము రమేశచంద్రదత్తు మున్నగు కొందరు దేశాభిమానులు కలెక్టరు ఉద్యోగములో నుండియే ఆహోదాలో వీలైనంతవరకు జనుల కుపకారముచేయ యత్నించిరి. కాని ఉద్యోగనియమములలో చాల నిర్బంధములు గలవు. తరుచు ఉద్యోగు లార్థికరాజకీయములందు అంతరాత్మ తోచినప్రకారము చేయుట కెంతమాత్రము నధికారము లేదు. జాతీయవాదులను బాధించు చట్టముల నమలుజరిపి, ప్రభుత్వము జరిపించు నిర్బంధములకు తోడ్పడుటయు,

జరుగును. కనుక, ఉద్యోగము నసలే వదలుకొని సుభాషు 1921 నుండి తనజీవితమంతను దేశసేవకే అర్పించెను.

అసహాయోద్యమమున వకీలువృత్తిని మానిన ప్రముఖులలో చిత్తరంజనదాసుగా రగ్రగణ్యుడు. ఆయన 1908 లో అరవింద ఘోషు వగైరాల కేసులలో పనిచేయునప్పటినుండి జాతీయవాదియే; 1918 ప్రాంతముకాయన కలకత్తాలో వకీలు నాయకుడాయెను; సాలీనా నాల్గులక్షల రూపాయల ఆదాయమును విభవమును మానుకొని, ఆయన 1921 ఆరంభమునుండి బెంగాలులో అసహాయోద్యమపు నాయకుడాయెను.

సుభాషు రాగనే ఈ జాతీయోద్యమమునజేరి దాసుగారి కుడిభుజముగ బనిచేయనారంభించెను. అప్పుడు సుభాషు తండ్రి తన 'రాయబహద్దరు' బిరుదుగూడ వదలెను.

దాసు సుభాషులు అప్పుడు యువకులను ప్రభుత్వపు యూనివర్సిటీని వదలిరండని విద్యార్థులకు బోధించిరి. అప్పుడా విశ్వవిద్యాలయపు ఉపాధ్యక్షుడగు శ్రీ ఆశుతోషముఖర్జి కాలేజీల విడువవద్దని విద్యార్థులకు నచ్చజెప్పెను. కాని గాంధి, దాసు, సుభాషుల ప్రచారఫలితముగ కలకత్తాలో వేలకొలది విద్యార్థులు తమ కాలేజీల వదలివచ్చిరి. వారి విద్యాభివృద్ధికై కొంతవరకైన నేర్పాటు చేయవలసివచ్చెను. కొంతసొమ్ము చందాలద్వారాపోగుచేసి, ప్రజానాయకులక్కడక్కడ జాతీయ విద్యాలయముల బెట్టిరి. దాసు సుభాషులు కలకత్తాలో గొప్ప

కళాశాలను స్థాపించిరి. 1903 లో జాతీయోద్యమ మారంభించినప్పటినుండి కలకత్తాలో జాతీయసాంకేతిక కళాశాల పని చేసినది. 1921 లోను బెంగాలు జాతీయకళాశాల మొదట చాల బాగుగనే ఆరంభించినది. గొప్పవిద్వాంసులు దానిలో బోధకులైరి. సుభాషచంద్రబోసే 1921 మే నుండి ఆకళాశాలకు ప్రిన్సిపాలు (=కులపతి). ఆయన ఆంగ్లము తత్వశాస్త్రములు బోధించుచు, ఆజాతీయకళాశాలను చాల నెలలు మంచి సమర్థతతో నిర్వహించి, దానికి చాల మంచిపేరు తెచ్చెను; ఆ విద్యార్థులకుజాతీయభావమును, ప్రజాసేవాపద్ధతులనుగూడ నేర్పెను. సుభాషు చతురుడేగాక, గొప్పవిద్వాంసుడు. కనుక ఆయన ఆకళాశాలను చాలప్రజ్ఞతో నడిపెను.

దేశమంతటను ఉద్యమము బలపడినది. ముఖ్యముగ, యువకులలో జాతీయభావము వ్యాపించుట సర్కారుకు కంటకమాయెను. దానినరికట్టి రాజభక్తినెక్కైన వృద్ధిచేయదలంచి, ప్రభుత్వమువారింగ్లండునుండి రాజుగారి పెద్దకొమకగు యువరాజును † రప్పించి, మనదేశమందాయన సంచారము జరిగించిరి. ఆయత్నమునువిఫలము చేసి మనజాతీయతను కాపాడుటకై, ఆసంచారమును ప్రజలు బహిష్కరించవలెనని కాంగ్రెసువారు

† ఈయన 1936 లో కొన్ని నెలలు '8 వ ఎడ్వర్డు' అను పేర రాజుగా నుండెను. కాని తరువాత పార్లమెంటువారీయనను తప్పించినారు; ఇప్పుడితడు "విండురుప్రభువు" అనబడును.

నిశ్చయించినారు; అందుకును, విదేశవస్త్రములనుకల్లునుకొనకుండ 'పికెటు' చేయుట (=నిరోధించుట) కును, యువకుల వాలంటీరుదళముల నేర్పర్చిరి. బెంగాలులో నీకార్యమును సుభాషు చాలసమర్థతతో సాగించెను. ఆదళములభగ్నము చేయుటకై, వాటిని ప్రభుత్వమువారు అక్రమసంఘములనిచెప్పి నిషేధించిరి; చాలమందిని అరెస్టుచేసి జైలులో బెట్టిరి. కలకత్తాలో యూరపియనులసంఖ్యయు ప్రాబల్యమునుచాల హెచ్చు. అక్కడ స్వాగతోత్సవము నెంతో వైభవముతో జరుప ప్రభుత్వముస న్నాహముల జేసిరి; వాలంటీరులల్లరి జేయకుండ వారుబందోబస్తు లుచేసిరి; వేలకొలది వాలంటీర్ల నరెస్టుచేసిరి. దాసు సుభాషుగార్ల నరెస్టుచేసి, జెయిలులోనుంచిరి. కాని అన్నియు వ్యర్థమైనవి. యువరాజువచ్చినరోజున ప్రజలలో నెవ్వరును రాలేదు. హర్తాళము సంపూర్ణమైనది. మామూలుపనులుకూడ లేకుండనగరమంత యునిర్జీవమైన ట్లుండినది. నల్లజండాలతో వాలంటీర్లుమాత్రమె దర్శైరి. సుభాషు బోధవలన మిల్లులపనివారునాఁడు జనరాలేదు. అంతట యూరపియనుల కమితమైన ఆగ్రహముగల్గినది.

# 6. గ్రామసేవ

ఇట్లు 1921 సం॥ డిసెంబరులో సుభాషచంద్రుని జైలు యాత్రయారంభించినది. అప్పుడాయన ఆరునెలలశిక్షనొంది, ఆలిపురజైలులోనుండెను. జైలునుండిరాగనే సుభాషు మరలయువకులలోను కార్మికులలోను తీవ్రముగ ప్రచారము జరిగించెను. బెంగాలులో సీమబట్టలఅమ్మకమును మద్యపానమును అప్పుడు బొత్తిగ తగ్గిపోయినవి. యూరపియనువర్తకులు తమసరుకుల చలామణి తగ్గినందుకు కోపావేశమొందిరి. దేశీయమగుఖద్దరుబట్టల గిరాకిహెచ్చినది.

నగరమందేగాక సుభాషు అప్పుడుగ్రామములలోనుతిరిగి ప్రజాసేవచేసెను. 1922 సెప్టెంబరు ఆఖరున బెంగాలులో హెచ్చువర్షములు కురిసెను. నదులకువరదలువచ్చెను. వంగరాష్ట్రము పల్లపుభూమి. గంగ బ్రహ్మపుత్రనదులు ఉపనదులప్పుడు పొంగెను. వీటికిపెద్దరైలురోడ్డు అడ్డముగనున్నది. ఆరోడ్డు వేయుటలో వాటికితూములను వంతెనలను చిన్నవిగొద్దివిగనుంచి, ప్రభుత్వమువారు విదేశపుకంపెనీలకు తక్కువఖర్చు యెక్కువలాభము కల్గుటే చూచుకొన్నారు. వరదలురాగనే రెయిలుగట్టు అడ్డగుటచే, మైళ్ళకొలదిగవరదనీరు నిలవమై, చాలజిల్లాలలో గ్రామములు మునిగిపోయినవి. కొంపలుకూలినవి. సస్య

ముమునిగి కుళ్ళి చెడిపోయినది. పశువులుచచ్చినవి. జనుల
కపార నష్టముకలిగినది. కాని వారిబాధలనివారణకై ప్రభుత్వము
వారు తగిన యేర్పాటులజేయలేదు.

ఈవరదలసంగతి తెలియగనే సుభాషు కలకత్తానుండి
తక్షణమే ఆజిల్లాలకువెళ్లి, స్వయముగ నొక్కడే ఆగ్రామము
లందు తిరిగివచ్చి, ఆచార్య ప్రఫుల్లచంద్రరాయిగారి కాసంగతి
తెల్పెను. ఆయనయు సుభాషువలె దీనబంధువు. రాయిగారి
అధ్యక్షతను సుభాషు వెంటనే బాధానివారణసంఘమేర్పర్చెను.
అప్పటికి సుభాషు వంగరాష్ట్రపు యువజనసమితికుపాధ్యక్షుడు;
సంఘసేవా సమితిలోను ముఖ్యసభ్యుడు; ఆసహచరులనువాలం
టీర్లను పోగుచేసి, బాధితులకై చందాసొమ్ము వసూలుచేయిం
చి, రాయిగారి యేర్పాట్లప్రకారముపనుల జరిగించి, బాధితు
లకు తిండి బట్టలనిప్పించి, ఇండ్లుకట్టించి, వేలకొలది దిక్కులే
ని జనులరక్షణకు తోడ్పడెను. అప్పుడాయన రాత్రిబగలు నమిత
ముగ శ్రమపడెను; అద్భుతమగుచాతుర్యముతో పనులజరిగిం
చెను. గ్రామములందలి బీదలకష్టసుఖములను గ్రహించి, వారి
కుపశాంతి గల్గించి, వారికిప్రేమపాత్రుడయ్యెను; వారికిఖద్దరు
ఆవశ్యకతను స్వయంసహాయపద్ధతులను నేర్పెను. ఇంతలో శ్రీ
రాయిగారి శిష్యులుచాలమంది ఆభారమును వహించిరి. అంతట
సుభాషు మరల రాజకీయములలోనికి దిగెను.

# 7. స్వరాజ్యపక్షము.

---

1922 సాలాఖరున గయలో కాంగ్రెసు మహాసభ జరిగినది. దానికి దాసుగారధ్యక్షులు. ఆయన సుభాషు నాసభకు తన సహచరునుగ తెచ్చెను. అందు దాసుగారి కతడు తోడ్పడెను.

1920 లో కాంగ్రెసువారు శాసనసభల బహిష్కరించిరిగదా! అందువల్ల ఆసభలలో మితవాదులు 'రాజభక్తులు' కులతత్వపువారును, చేరిరి. వారిసాయముతో ప్రభుత్వమువారు ప్రజాబాధకమగు క్రొత్తచట్టముల బెట్టిరి; జాతీయవాదుల నణచిరి; అందుచే మునిసిపలు లోకలుబోర్డులుగూడ ప్రజాద్రోహులపాల బడినవి. పైగా, తమనిరంకుశకార్యములకు 'ప్రజాప్రతినిధు'లే సమ్మతించినారని, ఈదేశము కాసంస్కరణలు చాలుననియు, ప్రభుత్వమువారు ప్రకటించిరి. శాసనసభలలో కాంగ్రెసువారుప్రవేశించి,మంత్రులనోడించి,ప్రభుత్వపుదుశ్చర్యలకు ప్రజామోదములేదని స్పష్టపర్చవలెనని, అందుకై శాసనసభలబహిష్కారమును రద్దుచేయవలెనని, దాసుగారు గయలో వాదించిరి. కాని కాంగ్రెసుసభవా రప్పుడొప్పుకోలేదు. అందు సుభాషచంద్రబోసు దాసుగారిపక్షము వహించెను. 1923 ఆరంభమున, దాసు మోతీలాలు మున్నగు కొందరు నాయకులు 'స్వరాజ్యపార్టీ' యనుపేర సభాప్రవేశపుపార్టీ నేర్పర్చిరి. దాసుగారు చాలపట్టుదల, ఆవేశమును, కలవాడు. 1923 సం॥ బెంగాలు శాసనసభయెన్నికలలో నీపక్షమువారు నిల్చి మితవాదులతో పోటీజేయ నిశ్చయించిరి. అందుకిష్టపడని

కాంగ్రెసువారు 'నోఛేంజర్లు' (=మార్పువద్దనువారు). ఇటు వీరితోను అటు సర్కారు కిష్టులతోను, స్వరాజ్యపార్టీకి పోరు వచ్చెను. దాసుగారితరపు ప్రచారభారము చాలవరకు సుభాషచంద్రునిపై బడినది. ఈప్రచారముకై దాసుగారప్పుడు 'ఫార్వర్డు' అను ఆంగ్లదినపత్రికను స్థాపించిరి. దానికిసుభాషే ముఖ్యసంపాదకుడు. ఆపత్రిక సంచాలనముచు సుభాషుమహాప్రజ్ఞతో జరిగించెను; ఆయన వ్యాసములసంగతులును శైలియు చాల ఆకర్షకములై యుండెను. క్రమముగ ప్రజాభిప్రాయము 'స్వరాజిస్టు'లవైపు మొగ్గినది. కాంగ్రెసుసభవారు నందు కర్థాంగీకారమిచ్చిరి. బెంగాలులో ఎన్నికసభ్యులలో హెచ్చుమంది స్వరాజ్యపార్టీ వారే వచ్చిరి. కాని ప్రభుత్వనియోజితసభ్యుల సంఖ్యవలనను, ముస్లిములలో జాతీయతచాలకయు, స్వరాజ్యపార్టీ 'కౌన్సిలో మెజార్టి' (=హెచ్చుసంఖ్య) రాలేదు. సుభాషును శాసనసభ్యుడై, పక్షనాయకుడగుచిత్తరంజనునకు చాలసహాయముచేసెను. బెంగాలులో ప్రభుత్వమువారికి ప్రతిఘటన హెచ్చెను. దాసు సుభాషులు తమప్రజ్ఞవలన ముస్లిం సభ్యులలో కొందరిచేత తమపక్షమువైపు వోటు చేయించగలిగిరి. అందువలన ప్రభుత్వపుచర్యలకు చట్టములకు సభాంగీకారము లేకపోయెను. మంత్రులపైన అవిశ్వాసపు తీర్మానమును గూడ స్వరాజిస్టులాసభలో నెగ్గించిరి. కనుక, మంత్రులు రాజీనామా నిచ్చిరి. ఇట్లాపాలనము ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకమని తేలినది.

---

# 8. మునిసిపలుపాలన.

1924 ఆరంభమున క్రొత్తమునిసిపలు ఆక్టుక్రింద కలకత్తా కార్పొరేషను (=పురపరిపాలనసంఘము) కెన్నికలు జరిగినవి. వెనుకటికన్న వోటర్లసంఖ్య, సభ్యులసంఖ్య, కార్పొరేషను అధికారము గూడ, హెచ్చినవి. ఇంతవరకు ఆ కార్పొరేషను యూరపియనులకు వారియిష్టులకు వశమైయుండినది. ఈసారి ఎన్నికలలో తాము నిల్చి, ఇందులో హెచ్చుస్థానముల గెల్చి, కార్పొరేషనును కాంగ్రెసు వారే పాలింపవలెనని దాసుగారునిశ్చయించి, ఆ ఎన్నికలకు స్వరాజ్యపార్టీవారిని నిల్పిరి. సుభాషును అందు గట్టి కృషిచేసెను. తక్కినపురములందువలెగాక, కలకత్తాలో యూరపియనుల ప్రాబల్యము చాలహెచ్చు. అచటివ్యాపారములు పరిశ్రమలు చాలవరకు బ్రిటిషువారి వశమందేయున్నవి. జూటు మిల్లులు, కాకితపుమరలు, స్టీమరుకంపెనీలు వగైరా వివిధ వ్యాపారములందు బ్రిటిషువర్తకులు సాలీనా కోట్లకొలది రూపాయలనార్జించుచు,అమితద్రవ్యమునుకూడ బెట్టియున్నారు. ఆమహానగరములో యూరపియనుల సౌకర్యముకు ధనాఢ్యుల లాభములకునే ప్రాముఖ్యముండెను. ఆ కార్పొరేషను ఆదాయము సాలుకు 2 కోట్లరూపాయలు. అక్కడ మనభారతీయులలో గూడ చాలమంది ఏదోరీతిని ఆబ్రిటిషువారితోను ప్రభుత్వము వారితోను సంబంధముందువారే. అందువలన తమ పలుకుబడి నంతను ఉపయోగించి, తమకిష్టులగు మితవాదులనే నెగ్గించ

వలెనని యూరపియనులును వారి సహకారులును విశ్వప్రయత్నములఁజేసి, తమధనమునుగూడ మంచినీళ్ళప్రాయముగ ఖర్చుపెట్టి ఎన్నికలయుద్ధము హాహాకారాహాకారముగ జరిగి, చివరకు కాంగ్రెసువారికే చాల హెచ్చుస్థానములువచ్చి, ఆకార్పొరేషను కాంగ్రెసు వారి వశమైనది.

అంతట దాసుగారు మేయరు (=అధ్యక్షుఁడు) అయిరి. ఆకొత్తభావములను సమర్థతతో నమలుజరుపుటకై సుభాషచంద్రబోసునే 'ఛీఫ్ ఎగ్జిక్యూటివు ఆఫీసరు' (=ముఖ్యనిర్వాహకుడు)గ కార్పొరేషనువారేర్పర్చిరి. ఆయుద్యోగము చాలముఖ్యము, పూర్ణాధికారము గలిగినది. దానికియూరపియనునే నెలకు రు 3000/ల హెచ్చుజీతముమీద వేయించుటకు ప్రభుత్వము వారు యత్నించిరి. కాని ఆయాటసాగలేదు. సుభాషు వెంటనే కార్పొరేషనులో పూర్వపద్ధతు లన్నిటిని మార్చివేసెను. ఇంతవరకుఆదాయములో చాలభాగము బీదలనుండి వచ్చుచుండెను. ప్రబలురు తమపైన హెచ్చుపన్నుపడకుండ తప్పించుకొనుచుండిరి. రాబడిలో చాలభాగము దొరలు శ్రీమంతులువసించు పెద్దరోడ్లందు వారిసౌఖ్యములింకను హెచ్చించుటకే వినియోగమగుచుండెను. సామాన్యప్రజలుండు చిన్నవీథులు దుమ్ముగొట్టుచు, నీటివసతియు పరిశుద్ధియులేక, నరకకూపములుగ నుండెను. సుభాషు భాగ్యవంతులనుండి పెద్దఉద్యోగులనుండికూడ రూలు ప్రకారము పూర్తిగపన్నులువసూలుచేయించి, ఆదాయము హెచ్చించెను. మరియు పెద్దపెద్దతారురోడ్లకై జరుగు విపరీతపు

ఖర్చు తగ్గించి, బీదలుండు పేటలలో క్రొత్తరోడ్లను నీటికొళా యీలనుబకులను పెట్టించి, ఆవీధులనుకూడ తుడిపించి, కార్మికులకు ప్రత్యేకవసతుల నేర్పర్చెను; ఇంగ్లండులోనుండు క్రొత్తపారిశుధ్యపద్ధతులను కలకత్తాలోను పెట్టించెను; దీనదయాళుడై బీదల బాధలనివారణకై మంచియేర్పాటుల జేసెను. ప్రతిరోజును తాను స్వయముగ కార్మికులు పంచములు నుండు పేటల బరీక్షించెను. పౌరపరిపాలనలో ప్రజలసౌకర్యముల కెట్టి యేర్పాటుల జేయవలెనో, ఇతరదేశములందెట్టి క్రొత్తపద్ధతుల బెట్టుచున్నారో, ఆరోగ్యాదుల నెట్లు వృద్ధిజేయవచ్చునో తెల్పుటకై, 'కలకత్తామునిసిపల్ గజెట్టు' అనుచక్కని వారపత్రికను స్థాపించెను. ఈపత్రిక యందు, ఆదర్శముగు మునిసిపాలిటీ యెట్లుండవలెనో, జనసౌకర్యము కాయావిషయములందెట్టి యేర్పాటుల జేయవచ్చునో, చాలక్రొత్తసంగతులను తెలుపుచు తక్కిన మునిసిపాలిటీలకును ఉపకారముచేయుచున్నారు. సుభాషు ఖద్దరువగైరాలకుప్రోత్సాహమిచ్చి, కార్యాలయమునందందరిచేతను బాగుగపనిచేయించికొద్ది నెలలలోనే ఆఫీసులోను, నగరమంతటనుగూడ సంపూర్ణమగు పరిణామముగల్గించి, ఉన్నతపద్ధతులనములులో బెట్టెను; విద్యాభివృద్ధిగల్గించెను; జాతీయవాదుల కుద్యోగములిచ్చి వారిచే ప్రజాక్షేమకరముగ బనిచేయించెను. అంతవరకు శ్రీమంతులకై జరుగు దుబారాఖర్చులు తగ్గింపబడి, వారిప్రత్యేకలాభములు పోయి, బీదలకు మంచి సదుపాయము లేర్పడినవి.

---

# 9. మాండలేకోట.

అందువల్ల, ప్రబలురగు యూరపియను వ్యాపారులకును, తమ కఠిననిరంకుశపద్ధతులు వెనుకటివలె సాగనందుకు ప్రభుత్వముకును, స్వరాజిస్టులపైనకోపముగలైరు. ఆబ్రిటిషు వ్యాపారులకు ప్రభుత్వములోను ప్రాబల్యమున్నది. వారందరిదృష్టియు సుభాషుపైన ప్రత్యేకముగ ప్రసరించినది. ఇట్లు, ఎప్పుడుసందు దొరుకునాయని వారు కనిపెట్టుచుండగా, ఒకపెద్దసాకు వారికి దొరికినది.

వంగరాష్ట్రమందిదివరలో కొందరుయువకులు హింసాపద్ధతినేర్చుకొని బాంబులు తుపాకులు తెప్పించి, వాటిద్వారా కొందరు దొరలనిదివరలోచంపబోయిరికదా! గాంధిగారిఅహింసాపద్ధతి బాగుగవ్యాపించిన 1920-1923లలో ఈదౌర్జన్యపద్ధతి క్షీణించినది. కాని, సత్యాగ్రహముపోయి 1924 లో గాంధిగారరెస్టుఅయిరి. అంతటకొందరు హింసాపద్ధతిని మరలనారంభించిరి. అప్పుడు కలకత్తాప్రాంతమందు కాంగ్రెసువాలంటీర్లను,జాతీయభావులను, అక్కడిపోలీసు కమిషనరగు 'చార్లెసుటెగార్టు' అనేకవిధముల బాధించుచుండెను. ఇతడు క్రూరస్వభావుడు; విప్లవకారులను పట్టుటలో సమర్థుడు; దేశాభిమానులగు చాలమంది యువకులను హింసపెట్టించినాడు; ఇతడు దుష్టుడని ఇతని నెట్లైన చంపవలెనని నిశ్చయించి, కలకత్తానడిబజారులో కారు

లో బోవుచున్న 'టెగార్టు' ఆకృతియున్న తెల్లదొరపైన 'గోపీనాథ సహా' అనువంగయువకుడు 1924 లో నొకబాంబును విసిరెను. అదితగిలి ఆదొర మరణించెను. కాని అతడు 'టెగార్టు' కాడు; అట్టిరూపమేగల 'డే', అనుసజ్జనుడగు ఆంగ్లేయుడు. 'సహా' కురి శిక్షయైనది. ఆవేసవిలో (సిరాజ్ గంజిలో) వంగరాష్ట్రమహా సభ జరిగినది. గోపీనాధునిచర్య తప్పేగాని అతని శౌర్యమును దేశభక్తినిహర్షించుచున్నామని ఆసభలో కాంగ్రెసు సభ్యులతీర్మానముజరిగినది. దరిమిలాను బెంగాలులో మరికొన్ని చోట్లగూడ, కొందరు విప్లవకారులు హింసాచర్యల జేయబోయిరి. హత్యలకై కుట్రలుజరుగుచున్నవని గూఢచారులు ప్రభుత్వముకు తెల్పిరి. అంతట సర్కారువారు 1924 అక్టోబరు 24 వ తేదీని కొత్తఆర్డినెన్సును జారీచేసిరి. దానిప్రకారము విప్లవకారుడని తమకనుమానమున్న యెవరినైనను ప్రభుత్వమువారరెస్టుచేసి, న్యాయవిచారణ లేకుండగనే తమకుతోచినంతకాలము జైలులోనుంచవచ్చును. ఈప్రకారమప్పుడు బెంగాలులో స్వరాజ్యపక్షీయులను చాలమందిని ప్రభుత్వమువారరెస్టుచేసి విచారణలేకుండ జైలులోనుంచిరి. అప్పుడే సుభాషచంద్రబోసును గూడ హఠాత్తుగ 1818 వ సం॥ 3 వ రెగ్యులేషను అనుప్రాత నిబంధనప్రకార మరెస్టుచేసి, ఎట్టివిచారణయులేకుండ ఆలిపూరు ఖైదులోనుంచిరి, కాని వెంటనే అటనుండి రప్పించి, స్టీమరెక్కించి, బర్మాకు తీసుకొనిపోయి, అక్కడ దూరస్థల

మగు 'మాండలే' కోటలో సర్కారువారు ఖైదీగనుంచిరి; ఆయన నేరమెట్టిదో నిరూపించలేదు; వివరములదెల్పలేదు.

'మాండలే' ఉత్తరబర్మామధ్యనున్నది. పూర్వమదిబర్మా రాజుల రాజధాని. కాని ఇప్పుడు దానిప్రభపోయినది. అది సముద్రమునకు చాలదూరము, ఆరోగ్యమైనది కాదు. వేసవిలో అత్యుష్ణము, తరువాత అతిశీతము. దాని వాతావరణము సుభాషుదేహము కొంతమాత్రమును సరిపడలేదు. ప్రభుత్వము వారు నాతనికి జైలులో తగు సౌకర్యముల నీయలేదు. క్రమముగా జబ్బుచేసి, ఆయన కృశించెను.

ఇదిగాక ఆయనకు మనోవ్యధకలిగెను. జాతీయసేవకుడగు తానెట్టినేరముచేసెనో వివరముల దెల్పుచు, ప్రభుత్వమువారు ఋజువుచేసి శిక్షించుటేసబబు; అట్లు జరుగలేదు. మరల యెప్పుడు విడుతురా? ఎప్పుడు బయటకు వచ్చి మరల ప్రజాసేవ చేయుదునా, అని సుభాషు ఆందోళనతో నుండెను. పైగా, విప్లవకారులకు సలహాదారై వారికి తుపాకులు వగైరా ఆయుధముల దెప్పించి పెట్టుచున్నట్లు నేరమని మాత్ర ముద్యోగు లాతనికి తెల్పిరి. అది వట్టి అబద్ధమని ఆతడు జబాబిచ్చెను. తానెన్నడు నుద్దేశించని దోషము నారోపించుటవలన గలిగిన అపవాదకాతనికి చాలవ్యధగ నుండెను. కాని, క్రమముగ నతడు మనస్సును గట్టిచేసుకొనెను. సాక్ష్యము విచారణలేదు. శిక్షలేదు. జైలులో

నెంతకాలముండవలెనో తెలియదు. ఈమనోవ్యాధికితోడు, నిరంతరము తిరిగిపనిచేయు తా నిట్లొక యిరుకుకొట్టులో నహోరాత్రములు బడియుండుట వ్యాధికికారణమైనది. కాని యాకోటపవిత్రతను ఇంతలో నాతనికి తోచినది. దేశభక్తుడు ప్రజానాయకుడు సర్వమాన్యుడునగు శ్రీ లాలాలజపతిరాయిగారిని (సేనలో విప్లవముకల్గించెనని వట్టి యనుమానమున) 1907 లో ప్రభుత్వమువారు తెచ్చి, ఈమాండలేకోటలోనే నిర్బంధించి కొన్ని నెలలుంచిరి. 1908 లో శ్రీ తిలకుగారిని 'రాజద్రోహము' కని శిక్షించి, ఆరేం డ్లీకొట్టులోనే యుంచిరి. ఆలోకమాన్యుడు ధీరుడై నిగ్రహముతో నిందే శ్రీ 'గీతారహస్య' మనుఅమూల్యమగు గ్రంథరాజమును రచించెను. ఆమహనీయుల వాసమువల్లను లోకోపకారకమగు గ్రంథరచనవల్లను ఆకొట్టు భారతీయులకు పవిత్రక్షేత్రమని స్మరించుచు, సుభాషు కాలముగడిపెను. కాని తనయారోగ్యము తిలకుగారిదానివలె లేదు. ఇట్లుండగా తుదకాతని దేహమందు శ్వాసకోశపు వ్యాధి యారంభించెను. ప్రభుత్వోద్యోగులుతనపైన క్రోధముతో నుండిరని సుభాషుకు తెలియును. కొంతకాలముకక్కడి జైలుఉద్యోగులాయనను చీకటికొట్టులో ఏకాంతవాసములో నుంచిరి. ఇట్లు రెండేండ్లు దాటినవి. వ్యాధిహెచ్చి, సుభాషు బొత్తిగ నీరసించెను. తమయిష్టప్రకార మికముందు నడచుకొన్నచో, ప్రభుత్వమువారతనిని వెంటనే విడుదలచేసియుందురు. కాని అట్టిదానికతడు

స్వాధ్యమందును తలపెట్టడు. ఆతనిస్థితిచూచి, ప్రభుత్వోద్యోగులనుమానించి, గొప్పడాక్టరులద్వారాఆతనిదేహము పరీక్షించిరి. అందొక్కడు సుభాషుసోదరుడగు సునీలచంద్రబోసు. ఈఘన వైద్యులు సుభాషు ప్రమాదస్థితిలోనున్నాడని, వెంటనే విడచి యూరపులోని స్విట్జర్లండులో చికిత్సజేయుంచుమనియు, రిపోర్టు నంపిరి. 'సరేకాని, వెళ్ళునప్పుడీదేశమందెవరిని చూడక, మాటాడక, సరాసరిగ యూరపుకుస్వంతఖర్చుపైనపోయి, అక్కడనుండవలెను. ఆర్డినెన్సుఅమలు తీరువరకీ దేశముకు రాకూడదు' అని ప్రభుత్వమువారు షరతులుపెట్టిరి. సుభాషెట్లో జీవించియున్న చాలునవిమెంచి, అంగీకరింపుకొనుమని సోదరులువద్దరాలతనికి వ్రాసిరి. కాని, సుభాషునిరాకరించెను; అందుకిట్లు కారణములదెల్పెను. 'నేనునిర్దోషిని; విచారణ లేకుండ జైలులోనుంచినందునవే, నాకీవ్యాధికలిగినది. అందుకు సర్కారే బాధ్యులు. నన్ను బంధుమిత్రులతో మాటాడకుండ, వారియాశీస్సులబొందకుండబంపుటేల? ప్రభుత్వమువారార్డినెంసు నెంతకాలమైన అమలులోనుంచవచ్చును. అట్లు చాల యేండ్లుంచినచో, నాయారోగ్యము బాగుపడినమీదటగూడ నన్ను స్వదేశముకు రానీయరు. ఇట్లు విదేశములలో సుఖించుటకన్న, ఇక్కడిజైళ్ళలో మరణించుటేమంచిది. మాతృదేశముకై ప్రాణమర్పించుటనాకిష్టమే. నా స్వేచ్ఛనిట్లుహరించినప్రభుత్వమువారునాయనుచరులకు సొమ్మునిచ్చుటకు బాధ్యులు. అట్లునువారు చేయలేదు; పైగా, వారి

దుశ్చర్యచే నాకేర్పడినవ్యాధి చికిత్సకై నేనే ఖర్చునంతయు భరింపవలెనట. వారన్నట్లు హింసావిప్లవపుటుద్దేశమే నాకున్నచో, నేను యూరపుచేరి, అందు రష్యావర్గాలకు పోయియుందును. అహింసాపద్ధతియే నాకిష్టమని మీరెరిగినదే. చిన్నన్నశిఫారసు చేసినను, ఇట్టిషరతులకు నేనంగీకరించను.' †

ఇట్లు సుభాషుప్రాణముకన్న దేశసేవయు ఆత్మగౌరవమునే ముఖ్యముగ భావించెను. ఆధైర్యనిశ్చయములకు విభ్రాంతులై, ప్రభుత్వమువారు (ఇక జైలులోనుంచిన ప్రమాదించునని తమవైద్యుల సలహాప్రకారము) సుభాషును 15-5-1924 తేదీని కలకత్తాకు స్టీమరుపైన తెచ్చి, అక్కడ విడచిరి.

---

† ఈయుత్తరమును సుభాషు తనయన్నయగు శరచ్చంద్రబోసుకు సం॥ 1927 ఏప్రిలులో వ్రాసెను. 'స్టేటు' ఖైదీల యనుచరులకు సహాయము చేయవలెనని ఆరిగ్యులేషనులో నున్నది.

A2

# 10. 'స్టేట్స్మను' కేసు

ఇట్లు షరతులు లేకుండ విడుదలయైనను, సుభాషబాబు చాల జబ్బుగనుండెను; కాని విదేశయాత్ర కిష్టపడక, బెంగాలులోనే కొద్దిరోజులు చికిత్సనొందెను; కొన్నిరోజులకు మరల కార్యరంగమునకు దిగెను. ఆయుత్సాహబలమువలన ఆయనకు కొద్దినెలలకే కొంతయారోగ్య మేర్పడినది.

ప్రభుత్వమువారాయన నట్లు జైలులోనుంచుట యన్యాయమే యని అప్పుడొకవిధముగ సూచితమైనది. ఖైదులోనుంచినవెంటనే, ఆయన నిర్దోషియని జనులనిరి. అందుకు జబాబుగ గవర్నరుగారు 'మాల్డా'పురిలో 24-11-1924 తేదిని మాటాడుచు, "ఇప్పు డార్డినెంసురెగ్యులేషనుల ప్రకార మరెస్టయిన వారందరును హింసాత్మక సంఘమువారు; వారు హత్యల జేయ కుట్రజేసినట్లు బెంగాలుప్రభుత్వమువారికిని (రెగ్యులేషను ఖైదీలసంగతికి ఇండియాగవర్నమెంటు వైస్రాయికిని) తృప్తికలిగించు నిదర్శనములున్నవి" అని, ఉపన్యసించెను. * 'ఆమాట

---

* "Every single man who has been arrested under Regulation 3 of 1818 or under the new Ordinance is a member of a terrorist organisation.......Every man too who has been arrested is being detained not on the isolated statements of a single informer, but on the evidence...which has to satisfy the Government of Bengal...and in the case of Regulation III prisoners, the Government of India and the Vice-roy himself."

నిజముకాదు; వారు నిర్దోషులే, కాని స్వరాజ్యపక్షప్రముఖులై శాసనసభలోను, కార్పొరేషనులోను, కార్మికోద్యమము ద్వారాను, ప్రభుత్వముకు యూరపియను వ్యాపారులకుగూడ అడ్డుదగిలి ధిక్కరించినారను కావేశీవల్లనే సర్కారిల్లు సుభాషు వగైరాలను ఖైదులోనుంచినారు', అని గాంధిగారును ఫార్వర్డు వగైరాజాతీయపత్రికలును వ్రాసెను. దానికి బ్రిటిషువారితరపు ముఖ్యవార్తాపత్రిక యగు 'స్టేట్స్మను' 26-11-1924 తేదీని ప్రధానవ్యాసమందు జవాబువ్రాయుచు, గవర్నరుగారి యుపన్యాససంగతులను మరల క్రోడీకరించి, పైగా ఇట్లు వ్యాఖ్యానము చేసెను. "కలకత్తాకు ముఖ్యకార్యనిర్వాహకుడగు సుభాషచంద్రబోసుగారు 3 వ రెగ్యులేషనుప్రకార మరెస్టు అయినారు. కనుక ఆయన నేరమునుగూర్చిన సాక్ష్యమును న్యాయవేత్తయగు వైస్రాయి స్వయముగ పరిశీలించును. తన కుడిభుజముగనున్న యతడిట్లు లరెస్టయినందుకు దాసుగారికి చికాకుగలిగినమాట నిజమే; కాని ఆ హింసాత్మకసంఘముకు సూత్రధారుడై తలకాయయే దాసుగారికిని స్వరాజ్యపక్షముకు మకుడిభుజముగూడ నైనచో, అది స్వరాజ్యపక్షము కనర్థకమే. ఈద్వంద్వస్వరూపముండుట మరదృష్టకరమే; కాని, స్వరాజిస్టు

లీవిషయమును గూర్చి కట్టిగ ప్రశంసించకుండుటే మంచిది."*

'ఈపత్రిక చేయు ఆరోపణ శుద్ధాబద్ధము. నాకు హింసాత్మకసంఘముతో సంబంధము లేదు. ఆవ్రాతవలన నాకప్రతిష్ఠ గల్గినది. కనుక ఈపత్రికవారివలన నష్టపరిహార మిప్పించవలెను' అని సుభాషుబోసు కలకత్తా హైకోర్టులో స్టేట్సుమనుపత్రిక యజమానుపైనను సంపాదకునిపైనను 1927 లో దావా తెచ్చెను. సుభాషువద్ద రాలకు విప్లవసంబంధమున్నట్లు ఆరోపణను ఆపత్రికవా రసలే ఋజువుచేయ లేకపోయిరి. కాని తామెట్లో తప్పుకొనుటకై, గవర్నరుచెప్పిన సంగతులనే ఉదహరించి అందుపైన సదుద్దేశముతో జనక్షేమముకై న్యాయముగ చర్చించినాము, కనుక అదితప్పుకాదని, వాదించిరి. ఆకేసును మొదట విచారించిన బక్లండుదొరగారంనుపైన భ్రమపడి, ఆవాదముప్రకారము కేసుకొట్టివేసెను. కాని సుభాషు అప్పీలుచేసెను. ముఖ్య న్యాయపతియగు రాంకినుదొరగారును ఘోషుగారును 1928 లో అప్పీలులో ఆతీర్పు రద్దుచేసిరి. "ప్రతివాదు లారోపణ

* Mr. Subhas Chandra Bose, Chief Executive Officer of Calcutta, was arrested under Regulation III, and therefore the evidence regarding his complicity has had to pass the trained legal scrutiny of the Vice-roy. It is no doubt disconcerting for Mr. Das that his right hand man has been arrested. But if the directing brain of the terrorist organisation was also the right hand man of Mr. Das and of the Swarajist party, so much the worse for the Swarajist party. This duplication of roles is unfortunate, but the Swarajists would be well advised to insist less strongly on the point

నిజమని నిదర్శనమేమియు కనబర్చలేదు. సుభాషుకు హింసాంఘముతో సంబంధమున్నట్లు ఋజువులేదు. మహోద్యోగులు పాలనధర్మములో ఒక్కొక్కవ్యక్తి నేరముచేసెనని ప్రకటించవచ్చును; వారినేమన వీలులేదు. కాని, ఆయపవాదమునే మరొక నరుడో పత్రికయో అన్నయెడల, అందుపైన నానిందితుడు తన ప్రవర్తనమంచిదని కోర్టుద్వారా స్థిరపర్చుకొనవచ్చును. ఆయపవాదమును సాధ్యమైనచో ఋజువుచేయుటకు ఇచ్ఛాశక్తులు గలసమర్థులపైనే వాది యీదావా తెచ్చినాడు; తాను నిర్దోషినని స్థిరపర్చుటకు వీలగువానినంతను చేసినాడు" అని వారువ్రాసి, గవర్నరు చెప్పినంతమాత్రమున అది వేదవాక్యము కాదని స్పష్టపర్చి, ఆయబద్ధపువ్రాత వ్రాసినందుకు మాననష్టపుపరిహారముగ ఆప్రతివాదులవల్ల సుభాషుకు వేయిరూపాయిలును రెండుకోర్టులలోను ఆయనకయినఖర్చులంతయు ఇప్పించిరి. *

* Great officers of the state may have in the course of their duty, to decide and sometimes even to declare that an individual is guilty of crime. But it is always open to that individual to wait until the accusation is repeated by a private individual or a newspaper.........and to come to court to clear his character.......The plaintiff here has sued defendants who are well able to defend themselves and little likely to be wanting in a desire to do so. I cannot forbear to say that he has done all that the law permits to vindicate himselff'. (per Rankin C. J.) There is no evidence on record proving that plaintiff is guilty of acts such as are imputed to him by the writer.

(per Ghose J.) I. L. R. 55 Calcutta P. 1121.

ఈ కేసు తీర్పువలన, సుభాషుబోసుకును స్వరాజ్యపక్షముకును నిజముగ దౌర్జన్యసంఘములో సంబంధమున్నదను మాట యబద్ధమని, ప్రభుత్వమువారు సుభాషును మాండలే కోటలోనుంచుట యన్యాయమే అనియు, మనదేశీయులందరికిని అభిప్రాయము మరింతిదృఢపడినది.

తనకొరకుగాక, మననాయకులపైనచేయు అన్యాయపు ప్రచారములను అపవాదలను ఖండించి ఆబ్రిటిషుపత్రికలకు బుద్ధితెచ్చుటకే సుభాషబోసుగారు కేసునుపెట్టి వ్యయ ప్రయాసలకు లోనై తీర్పునొందెను.

బ్రిటీషుపత్రికలు తమప్రభుత్వపు అండచుచూచుకొని మన నాయకుల దూషించుట కిదే మొదటిసారికాదు. 1907 లో శ్రీ లజపతిరాయిగారిని ప్రభుత్వమువారు (1818 సాలా 3 వ రెగ్యులేషనుక్రిందనే) అరెస్టుచేసి విచారణలేకుండ మాండలేజైలులోనేయుంచిరి. అప్పుడు పంజాబుప్రాంతములో భారత సేనలోని సిపాయీల రాజభక్తిని పోగొట్టుటకు లజపతిరాయిగారు యత్నించినట్లును కనుకనే ప్రభుత్వమువారు లజపతిరాయిని జైలులో నుంచినారని, కలకత్తాలో 'ఇంగ్లిష్‌మన్' అను అప్పటి మరొకబ్రిటిషుపత్రిక ఒకలేఖ ప్రచురించెను. జైలు నుండి విడుదలయైనమీదట లజపతిరాయిగారు ఆయారోపణ అబద్ధము అన్యాయమునని, దావాతెచ్చి, 1500 ల రూపాయలు ఖర్చులకు ఆపత్రికపైన డిక్రీనొందిరి.

---

† ఇం. లా. రి. 37 కలకత్తా 760 వ పేజీలోని తీర్పునుచూడుడు.

# 11. యువక ప్రచారము.

ఈలోగా 1925 లో శ్రీ చిత్తరంజనదాసుగారు మరణిం చిరి. సుభాషబోసును యతీంద్రమోహానసేనుగుప్తయును వంగ కాంగ్రెసునాయకులైరి. 1928 లో సుభాషబోసు వంగరాష్ట్ర మంతటను యువకసంఘములనేర్పర్చి, యువకులలో గొప్ప ప్రబోధముగల్గించెను. మనదేశపురాజ్యాంగమును గూర్చి విచా రించుటకు ప్రభుత్వమువారప్పు డేడుగురు పార్లమెంటుసభ్యుల సంఘమును మనదేశముకంపిరి. మనప్రతినిధులుకాని తెల్లవారినే అందుకంపుట అన్యాయము. కనుక (బహిష్కారసూచనగ) వారువచ్చినచోట్ల ప్రజలు హరతాళములు జరిపి విచారము సూచింప కాంగ్రెసువారు నిశ్చయించిరి. 1928 ఫిబ్రవరిలో నీ "సైమనుకమిషను" కలకత్తాకువచ్చెను. ఆసప్తకమును కలకత్తా ప్రజలుపూర్తిగ బహిష్కరించునట్లు సుభాషుకట్టుదిట్టమగు నేర్పాటులజేసెను. ఆరోజున కలకత్తాలో హర్తాళమద్భుతముగ జరిగినది. యూరపియనుమిల్లులలోని కార్మికులుగూడ సుభాష బోసు ప్రోత్సాహమున నారోజున పనులుకట్టిపెట్టిరి. బజారు అంతయు నిర్జనమైనది. సాయంకాలమున బ్రహ్మాండమగు సభ జరిగినది. సైమనుకు నల్లజండాలు ప్రత్యక్షమైనవి. అందుయువ కులు బాగుగపనిచేసిరి. అంతట ప్రభుత్వమువారు కోపించి,

సుభాషువగైరాలను లాఠీలతో కొట్టి, తరువాత అరెస్టుచేసి శిక్ష వేసి, జైలులోనుంచిరి.

1928 లో మరల జైలునుండివచ్చిన తరువాత బెంగాలురాష్ట్రీయకాంగ్రెసుసంఘముకు సుభాషబోసే అధ్యక్షుడయ్యెను. ఆయన బంగాలులో 'ఇండిపెండెంసులీగు' (= స్వాతంత్ర్యసంఘము) ను దానికి జిల్లాలలో శాఖలను స్థాపించి, సంపూర్ణస్వాతంత్ర్యమే మన పరమావధి అని అంతటను ప్రచారము చేసెను. అప్పుడాయన అహోరాత్రములు జరిగించిన కృషి వలన, వంగరాష్ట్రమంతటనునవజీవమును అమితోత్సాహమును గల్గినవి. 1928 లో పూనాలో జరిగిన మహారాష్ట్ర రాష్ట్రీయ మహాసభకాయన నధ్యక్షునిగ నెన్నుకొనిరి. అందు మనపూర్వ సంస్కృతిని జాతీయసిద్ధాంతములను సుభాషు తనఅధ్యక్షోపన్యాసములో చక్కగవివరించి,ఆసభను చాలజయప్రదముగ జరిపెను; అప్పుడు బొంబాయిమున్నగుచోట్ల, యువకసంఘము లందును ఆయన ఉపన్యాసములిచ్చి, ప్రచారము జరిగించెను.

ఆసాలు కాంగ్రెసు మహాసభ మోతీలాలుగారి అధ్యక్షతను కలకత్తాలోనే జరిగెను. అదిచక్కగ జరుగునట్లు తగు ఏర్పాటులన్నిటిని సుభాషబోసే జరిపి, తానే అప్పటివాలంటీరు దళపు ముఖ్యనాయకుడై, ఆసభనెట్టిలోటును లేకుండ నెరవేర్పించెను. జండాఉత్సవమునకు 5000 కార్మికులగూడ రప్పించిదానికి నవ్యకళగల్గించెను; కాంగ్రెసుకు పూర్ణస్వాతంత్ర్యమే ఆద

ర్యము, కానిడొమినియను ప్రతిపత్తి కాదని సుభాషును జవాహర్లాలును ఆసభలో వాదించిరి; ఏడాదిలో 'నెహ్రూరిపోర్టు' ప్రకారము రాజ్యాంగము సంస్కరింపనియెడల, పూర్ణస్వాతంత్ర్యమే కాంగ్రెసు లక్ష్యమని తుదకు తీర్మానమైనది. అంతట యువకులలోను కార్మికులలోను 1929లో జవాహర్లాలు సుభాషబోసుగార్లు ఉత్తరమధ్యదేశములందు నిరంతరము ప్రచారమును సంఘనిర్మాణమును జేసిరి; ఇక సత్యాగ్రహము రానున్నదని తెలిపి, అందుకు జనులను తయారుజేసిరి.

1929 లో కార్మికులపైన యువకులలో ముఖ్యులపైన ప్రభుత్వమువారు కేసులబెట్టిరి. కలకత్తాలో జరిగిన అట్టి కేసులలో ముద్దాయిలు నిర్దోషులని ఋజువుచేయుటకు సుభాషచంద్రుడు కట్టుదిట్టముగావించి, వారికి సౌకర్యము లేర్పర్చెను. ఆసాలున ఆయన అఖిలభారతకాంగ్రెసు వర్కింగు కమిటీలోగూడ సభ్యుడై, కాంగ్రెసు నిర్వాహకుల అంతరంగపు ఆలోచనలలోను పాల్గొనుచుండెను.

సుభాషు కార్మికులలో సంఘీభావము రాజకీయజ్ఞానము గల్గించుటకు కృషిచేసినవాడు. 1929 డిశెంబరులో నాగపురములో ట్రేడుయూనియను సంఘపు వార్షికసభ జరిగెను. అందు రాబోవు సాలుకధ్యక్షుడుగ సుభాషబోసునే యెన్నుకొనిరి. వారి వ్యవహారములలో సుభాషు ప్రత్యేకశ్రద్ధ తీసుకొని, వారికవసరమగు సలహాల నిచ్చియున్నాడు.

---

# 12. సత్యాగ్రహము.

---

ఆసాలాఖరున లాహోరులో జవాహర్లాలు అధ్యక్షత ను కాంగ్రెసు జరిగినది. సుభాషు అందుత్సాహముతో పాల్గొనెను. తానింతవరకు శ్రద్ధతో ప్రచారముచేయు సంపూర్ణ స్వాతంత్ర్యపుతీర్మానమా సభలో అంగీకృతమైనందుకాయాన సంతోషించెను. వంగరాష్ట్రపునాయకత్వమును గూర్చి కొంత కాలమునుండి జాతీయవాదులలోనే రెండుపక్షము లేర్పడినవి. యువకపక్షమువారు సుభాషును, తక్కినవారు సేన్గుప్తగారిని, కోరిరి. మోతిలాలు నెహ్రూగారు (కొంతవరకు గాంధిగారును) సేన్గుప్త నాయకత్వమునకుతోడ్పడిరి. వారికి సుభాషుతో లాహోరులో భేదాభిప్రాయము గల్గినది. ఆకాంగ్రెసుకాగనే కొత్త వర్కింగుకమిటీసభ నేర్పర్చిరి. ఆసభ్యులను అఖిలభారతకాంగ్రెసు కమిటీవారు ఓటులద్వారా యెన్నుకొనుట సవ్యమని సుభాషు కోరెను. కాని, ఆసారియు యథాప్రకారముగ గాంధిమోతీలాలుగార్ల సూచనపైన అధ్యక్షుడే నియమించెను. అంతటసుభాషు ను శ్రీనివాసఅయ్యంగారును కాంగ్రెసునుండి విడిపోయి,వెంటనే "కాంగ్రెసు డెమాక్రెటికుపార్టీ" అనుపేర వేరుగ ప్రజాతంత్ర పక్షము స్థాపింతుమని ప్రచురించిరి. కాని, అది అమలుజరుగ లేదు. ఈయిద్దరిలోను తత్వముభేదించినది. ఒకరుత్యాగి, మరొ

కరుభోగి. కొద్దిరోజులలోనే సత్యాగ్రహమును దేశమంతటను జరుపుటకు కాంగ్రెసువారు నిశ్చయించిరి. శ్రీనివాసఅయ్యంగారు అంతట జాతీయకార్యములవదలుకొని, మరలవకీలువృత్తి నారంభించెను. సుభాషు అంతకుముందే కలకత్తాలో 11-8-29 తేదీని రాజకీయ బాధితుల సభలో అద్భుతముగ నుపన్యసించెను. ఆయన అందు రాజద్రోహకరముగ నుపన్యసించినాడని ప్రభుత్వమువారాయనపైనకేసుపెట్టిరి. 1930 జనవరిలో కఠినశిక్ష పొంది (దేశమందున్నసత్యాగ్రహము రాకముందే) సుభాషునుగల జైలులో వసించెను.

జైలునుండి సుభాషు ఆగస్టులోవచ్చెను. ఈలోగా సేన్గుప్తగారున్నసత్యాగ్రహములో జైలుకువెళ్ళిరి. అందువలన కలకత్తా కార్పొరేషను మేయరుపదవి ఖాళీయైనది. ఆసభ్యులందరును వెంటనే సుభాషును ఆల్డరుమను (=గౌరవసభ్యుడు)గను, అంతటతమ 'మేయరు' గను ఎన్నుకొనిరి. ఇట్లాయన 22-9-30 నుండి మేయరై, కలకత్తాపురపాలన వ్యవహారములను దీక్షతో జరిపెను. మేయరు హోదాచాలగౌరవమైనది; కనుక ఆయన నుద్యోగులరెస్టుచేయుటకు కొన్నినెలలుజంకిరి. కాని ఆయన బెంగాలులో తీవ్రముగసత్యాగ్రహముచేయుచుండెను; "మాల్డా" కు ప్రచారముకేగుచుండగా, అక్కడకు రాకూడదని ఆజిల్లా కలెక్టరాయనకు నోటీసునిచ్చెను. కాని సుభాషుమేయరుపదవిలోనున్నను, ఉత్సాహి, యోధుడు, అభిమాని; కనుక, వెంట

నే ఆయాజ్ఞనుల్లంఘించెను. ఒకరైలుస్టేషనులోఅరెస్టుచేసి, మేజస్ట్రేటు, అక్కడిగదిలోనే విచారించి, ఆయనకు 18-1-31 వ తేదీని వారంరోజులశిక్షవేసెను. అఖైదునుండి కలకత్తాజేరి, సుభాషు వెంటనే స్వాతంత్ర్యదినోత్సవమును కలకత్తాలో జరిగించెను. అయితే అక్కడ ఉత్సవములజరుపకూడదని ప్రభుత్వమువారు నిషేధించిరి. కాని సుభాషుఆనిర్బంధములను మన్నించలేదు; కార్పొరేషనులో మేయరుపనులను త్వరగ చక్కబెట్టుకొని, 26-1-31మధ్యాహ్నము కార్పొరేషనుభవనమునుండియే బ్రహ్మాండమగు నూరేగింపును తానే నాయకుడుగజరిపెను. మేయరుఅధికారియేయిట్లుధిక్కరించి సత్యాగ్రహముచేయగనే, జనులయావేశమతిశయించెను. కానిప్రభుత్వమునకు పట్టరానియాగ్రహమువచ్చెను. అంతట పోలీసు ఉద్యోగులు కలకత్తాలో పెద్దరోడ్డగు చౌరంగీవీధిలో ఊరేగింపుమొగనున్న సుభాషబోసును తలమీదను చేతులమీదను లాఠీలతో చాలదెబ్బలుకొట్టిరి; దేహమునుండి రక్తముకారుచున్నను మానలేదు; ఆయనమూర్ఛనొంది నేలపైబడెను. అప్పుడాయనను, రక్తసిక్తునిగనే బండిమీదగొనిపోయి, పోలీసువారరెస్టుచేసి, ఖైదులో నుంచిరి. వైస్రాయి రాజీకోరి కాంగ్రెసునాయకులను వదలురోజుననే, బెంగాలుప్రభుత్వ మీక్రూరచర్యచేసి, 6 నెలల కఠిన శిక్షవిధించి, సుభాషును జైలులో నుంచిరి. శాసనసభలోను కార్పొరేషనులోను సభ్యులీచర్యను తీవ్రముగనిరసించిరి. చాలరోజులవరకు సుభాషుకు దెబ్బలబాధపోక, జబ్బుచేసెను.

ఈలోగా రాజీమాటలు పూర్తియై, గాంధి యిర్విను సమాఖ్య ప్రకారము 5-3-31 తేదిని సుభాషబోసును బయటకువచ్చెను.

అప్పుడు క్రొత్తరాజ్యాంగపు ఏర్పాటుకై జరుగురెండవ 'రౌండుటేబిలు' సభలో కాంగ్రెసు తరపున పాల్గొనుటకుప్రభుత్వము వారు గాంధిగారిని 1931 ఆగస్టులో లండనుకురప్పించిరి. ఈరాజీకుదరదని, ప్రజలకు నిజమైన అధికారమీయరని, మన ఆంగ్లోద్యోగులు ముందే నిశ్చయించిరి; మరల సత్యాగ్రహము రాకుండ, బందోబస్తుచర్యలారంభించిరి. ఇంతలో పార్లమెంటు యెన్నికలు జరిగి, ఇంగ్లండులో లేబరుమంత్రిత్వము పోయి, కరడుగట్టిన నిరంకుశులగు కాన్సర్వేటివులప్రభుత్వము వచ్చినది. (గాంధిగారెంత ప్రయత్నించినను) వారు స్వరాజ్యవాసనను స్వప్నమందును తలపెట్టరని స్పష్టమైనది. ప్రభుత్వము కాలము గడిపి, స్వరాజ్యప్రశంస మూలకుత్రోసిరి. ఈలోగా బెంగాలులో ఉద్యోగులు గాంధియిర్వినసమాఖ్యకు వ్యతిరేకముగా ప్రజలను బాధించి, చాల నిర్బంధములబెట్టిరి. చిట్టగాంగులో కొందరాంగ్లేయులు చాలదారుణహింసలగావించిరి; "హిజ్లి" జైలులో నిరాయుధులగు ఖైదీలను పోలీసువారు పేల్చిబాధించిరి. మిడ్నపుర జిల్లాలోని జులుముకుమితియే లేదు. ఇట్టి ఘోరముల నెదుర్చుటకు ప్రజలాందోళనజేయగా, ప్రభుత్వము వారు క్రొత్త "ఆర్డినెన్సు" తెచ్చిపెట్టి, చాలమంది నరెస్టుచేసి నిర్బంధముల పాలుగావించిరి. శక్తివంచన లేకుండకృషిచేసి, శిలాహృదయులగు బ్రిటిషుమంత్రుల వదలి,గాంధిమహాత్ముడాసాలాఖరుకు బొంబాయి రేవులోదిగెను

దేశమంతటను ప్రభుత్వపు అక్రమచర్యలు వినవచ్చెను. సుభాషు బొంబాయికి వెళ్ళి, బెంగాలులో ఉద్యోగుల విధానమును గాంధిగారికి వినిపించెను. దేశముపై నేదో పిడుగుపడనున్నదని వర్కింగుకమిటీవారు గ్రహించి, ఇకసత్యాగ్రహము జరిగించ దలచిరి; ఇంతలోనే 4-1-1932 తేదీని ప్రభుత్వమువారు ఆర్డి నెంసుల వర్షము కురిపించి, గాంధివగైరానాయకులను వేలకొలది దేశభక్తులను అరెస్టుచేసిరి. అంతకుముందే మహాత్మునితో మాటాడి బొంబాయినుండి వచ్చుచుండగా, ఆరాష్ట్రిముందే 'కళ్యాణ'పురిలో సుభాషచంద్రుని 2-1-1932 తేదీనే ప్రభుత్వ మువారరెస్టుచేసిరి; 1924 లోవలె, మరల 1818 సం॥పు 3 వ రిగ్యులేషనుక్రిందనే పట్టుకొని, జైళ్ళలో త్రిప్పిరి.

జనులు పికెటింగువగైరా సత్యాగ్రహచర్యల జరిగించిరి. చాలమందికి లాఠీదెబ్బలుతగిలెను. ఇతరనిర్బంధములకు మితియే లేదు. 1932 సాలంతయు ఇట్లు జరుగుచుండగా, సుభాషు 'సేటుఫైదీ'గ జైలులో గ్రమగ్గుచుండెను. ఆయనకు తగువసతి నీయలేదు. ఆయనకు మరల ఆరోగ్యముచెడి చాలజబ్బుచేసినది; బాధదుర్భరమైనది. ప్రభుత్వమువారు ఘనవైద్యులచే పరీక్ష చేయించగా, చాలప్రమాదస్థితిలోనున్నట్లు తేలినది. శల్యావశిష్టుడుగనున్న సుభాషునప్పుడు ఈదేశమందుండకూడదని, చికిత్సకు యూరపుకుపోయి అందేయుండవలెననికూడ, ప్రభుత్వ మువారు నియమించిరి; జైలునుండి బొంబాయికితీసుకొనివచ్చి-స్టీమరునెక్కించి, ఆయనపై 'రిగ్యులేషనుఆంక్ష'ను తీసివేసిరి.

---

55

# 13. యూరపు ప్రవాసము.

అంతట 1933 సం॥రం ఫిబ్రవరిలో బయలుదేరి, సుభాషు యూరపు॰లో స్విట్జర్లండులోను, తరువాత ఆస్ట్రియాలోని వియన్నాలోను, విజ్ఞులయొద్ద ప్రత్యేకచికిత్సనొందెను; కొన్ని నెలలైన మీదట కొంచముగ గుణము కలిగినది. అప్పటినుండి సుభాషు అక్కడి దేశములందు ప్రముఖులతోను నాయకులతోను మాట్లాడియు, పత్రికలలో వ్యాసములవ్రాసియు, ఉపన్యసించియు, మనదేశీయులనుగూర్చి సదభిప్రాయముగల్పించెను. 'భారతీయులనాగరికులు, స్వరాజ్యముకుతగరు,' అని బ్రిటిషువారు వారి మిత్రులు చేయు ప్రచారసంగతు లబద్ధములని నిదర్శనపూర్వకముగ తెల్పెను; విద్యావ్యాపారము వగైరాలకై మనవారు యూరపులో నుండుటకు సౌకర్యముల హెచ్చింపజేసెను. భారతీయుసమస్య సరిగా బోధపడుటకు, బ్రిటిషుసామ్రాజ్యపద్ధతి హైందవజాతికి లోకమంతటికిగూడ ఎట్లు హానికరమో వివరించుచు, ఆయన The Struggle in India (=భారతసమరము) అనుగ్రంథముగూడవ్రాసి ప్రచురించెను. కాని దానిని చదివిన బ్రిటిషుపాలనపైన ద్వేషముకల్గునని యెంచి, ప్రభుత్వమువారు ఆపుస్తకము మనదేశమునకురాకుండ ఆంక్షబెట్టిరి. ఆయన అప్పుడింగ్లండునకుగూడ రాకుండ బ్రిటిషుప్రభుత్వమువారు నిషేధించిరి. కనుక, ఆయన ఐర్లండుమాత్రమువెళ్ళి అక్కడిపరిస్థితులను గమనించి, ఐరిషు నాయకుడగు 'డివెలెరా' గారితో స్వయముగసంప్రతించి, మరలివచ్చెను.

ఈలోగా, అసెంబ్లిఅధ్యక్షతవదలి సత్యాగ్రహమున జైలువాసమొందిన విఠలభాయిపటేలుగారును సుభాషువలె చాలజబ్బుపడి యూరపుకు పోవలసివచ్చెను. ఆయన వియన్నాలో చికిత్సనొందుచుండగా, సుభాషు ఆయనకు పుత్రునివలె నుపచారముచేసెను. ఉభయులును మంచిమిత్రులైరి. యూరపులో మనదేశపుస్థితినిగూర్చి యథాస్థితి తెల్పుచు ప్రచారము చేయుట చాలఅవసరమని విఠలభాయిగారును తలచిరి. ఆయన వృద్ధులు. మనదేశపుజైళ్లలో ఆయనవ్యాధి చాల ముదిరినది. యూరపులో చికిత్సనొందినప్పుడు కొంతబాధ తగ్గినది; కాని, మరలజబ్బుచేసి, ఆయనయూరపులోనే చనిపోయెను. పటేలుగారప్పుడొకవిల్లువ్రాసిరి: అందు తనఆస్తిలో ఒకలక్షరూపాయల సొమ్మును యూరపులో మనదేశము తరపున ప్రచారము జరిగించుటకు నిధిగవినియోగించవలెనని, దాని అమలును సుభాషబోసే జరిగించవలెననియు, ఏర్పర్చిరి. కాని ఆయన వారసు లాసొమ్మునింతవరకు సుభాషబోసు కప్పగించలేదు. కనుక ఆయేర్పాటు లాభము మనకింకను కలుగలేదు.

ఇట్లుండగ తండ్రియగు జానకీనాథబోసు చాలజబ్బుగ నున్నట్లు తెలిసి, మనదేశముకు వచ్చుట కనుజ్ఞకొరకుసుభాషు చాలసార్లు దరఖాస్తుపెట్టెను. చాలకాలమనుజ్ఞరాలేదు. తండ్రి ఇకబ్రిదుకుటదుర్లభమని తెలిసి సర్కారువారు సుభాషుకు తండ్రినిచూచిపోవుటకనుజ్ఞయిచ్చిరి. వెంటనే సుభాషు వాయుయానముమీద వచ్చివేసెను. కాని ఈలోగానే తండ్రి మరణిం

చెను. ఆశోకభారముతో సోదరులతో కలసి, ఆయన తండ్రికుత్తర క్రియల జరిగించెను. కాని ప్రభుత్వ మప్పుడును సుభాషుకు స్వేచ్ఛనీయలేదు; గృహకార్యములకే ఆయనను పోనిచ్చిరి; అక్కడకూడ పోలీసువా రాయనను విడువలేదు; రాజకీయములగూర్చి యెవరితోను మాటాడనీయలేదు. ఈచర్యలాయనకు మనోవ్యథ గల్గించెను. నెలగడచినవెంటనే ఆయన ప్రభుత్వాజ్ఞప్రకారము యూరపుకే వెళ్ళి వెనుకటివలె నుండెను.

1933-34 లలో మనదేశమందు గాంధిగారు సత్యాగ్రహమాపుచేయించి, అస్పృశ్యతానివారణవగైరాలపై శ్రద్ధవహించినారు. కొందరు దేశసేవకు లీపనుల జేయుచున్నారు. కాని తక్కినవారు ఏదో రాజకీయక్రియ యుండవలెనని భావించిరి; ప్రస్తుతము సత్యాగ్రహముకు తగు పరిస్థితులు లేవు. 1934 లో మనభారతశాసనసభ కెన్నికలు జరిగినవి. మరియు బ్రిటిషుప్రభుత్వమువారు కొత్తరాజ్యాంగము ప్రకారము త్వరలో రాష్ట్రములందును ఎన్నికల జరుపదలంచిరి. ఈయెన్నికలలో కాంగ్రెసువారు పాల్గొని మరల దేశమందు రాజకీయోత్సాహము గల్గించుటకు కాంగ్రెసుమహాసభ సమ్మతించినది. 1934 లో జరిగినయెన్నికలలో హిందువుల యెన్నికస్థానములు చాలవరకు కాంగ్రెసువారికేవశమై అసెంబ్లీలో ప్రజాభిప్రాయముబలమైనది.

---

# 14. పునరాగమనము.

1936లో క్రొత్తచట్టమమలుకువచ్చినది. ఆప్రకారము ఆయారాష్ట్రములందు శాసనసభలకును మంత్రులకును కొంచె మధికారమువచ్చినది. లక్నోలో 1936 ఏప్రిలులో జవాహర్లా లునెహ్రూ అధ్యక్షతను కాంగ్రెసుమహాసభ జరిగినది.

ఇంకను యూరపులో నుండుటకన్న స్వదేశమునకు వచ్చి మాతృభూమినారాధించవలెనని సుభాషబోసునకు రోజురోజును సంకల్పము హెచ్చినది. కాని ఆయన మనదేశమునకు వచ్చుట కును ప్రభుత్వమువా రనుజ్ఞనీయలేదు. ‘ఎవరిదేశమునకు వారు వచ్చుట కనుజ్ఞ కావలెనా!’ అని కొందరి కాశ్చర్యముతోచ వచ్చును. కాని మనపరాధీనస్థితివలన స్వదేశమునకు చేరుటకును ‘పాస్పోర్టు’ కావలెను. ఆచీటీని ప్రభుత్వమువారీయలేదు. అది లేకుండ వచ్చినచో ప్రమాదమే. కాని విదేశములందుండుట కన్న, మాతృదేశపుజైలులో బాధ లనుభవించుటే మంచిదని తుదకాయన నిశ్చయించి, 1936 మార్చిలో యూరపునుండి స్టీమరుపైన బయలుదేరివచ్చెను. బొంబాయిచేరగనే, స్టీమ రులోనే మనదేశపుపోలీసుకింకరు లాయనకుప్రత్యక్షమై, మన ప్రభుత్వమువారి వారంటుప్రకార మరెస్టుచేసిరి. ఇట్లాయన లక్నోకాంగ్రెసునకు హాజరగుటకును సోదరులను తల్లినిగూడ చూచుటకును వీలులేకుండనే, 10-4-36 తేదీని మరల జైలు లోనికి పోయెను.

ఆయననేరమేమో తెలియలేదు. మనదేశపు నేలమీద నింకను కాలుపెట్టకుండనే, ప్రభుత్వమువారు (1818 సం॥ రెగ్యులేషను క్రిందనే) అరెస్టుచేసినారు.

ఇట్లు సుభాషబోసు మరలజైలులోనే ఉండుచు, బాధపడుచుండెను. ఈస్థితిలో, 1937 సం॥ జనవరి ఫిబ్రవరిలలో అన్ని రాష్ట్రములలోను ఎన్నికలు జరిగినవి. చాల రాష్ట్రములలో కాంగ్రెసువారికే హెచ్చుస్థానములు వచ్చినవి. వారుమంత్రిత్వ మంగీకరింపలేదని కాంగ్రెసువారిని ప్రభుత్వమువారును కొందర జేయుచుండిరి. ఇక 1-4-37 నుండి క్రొత్తచట్టము ప్రకారము "రాష్ట్రీయస్వాతంత్ర్యము" అనులుకువచ్చును. కాంగ్రెసువారు మంత్రిత్వము వహించుటా మానుటా అనుసంగతి నిర్ధారణ చేయుట కామార్చిలో అఖిలభారతకాంగ్రెసుసమితి కూడనుండెను. ఇంకను సుభాషును జైలులోనుంచుట అసందర్భమనితోచి, సర్కారువారు నిర్బంధమునుండివిడచిపెట్టిరి. కాని చాలజబ్బులో నున్నందున, సుభాషు ఆసభలందు పాల్గొనలేకపోయెను; (జైలులోనున్నను సుభాషు కాంగ్రెసుకార్యసమితిలో గూడ సభ్యుడుగనియమితుడయ్యెను.) కొన్నినెలలు స్వస్థలమందును, తరువాత పంజాబులోని 'డల్హౌజీ' అను ఆరోగ్యదమగు గిరిపురిలోను, సుభాషు నివసించెను. ఆయన ఈఅస్వస్థతవల్లను, అంతకుముందు జైలుయాత్రవల్లను, తరుచు కాంగ్రెసుఆలోచనలలో పాల్గొనవీలులేకుండినది. ఆయనలేనిసమయమందు దన్నయగు శరచ్చంద్రబోసు కార్యసమితిసభ్యుడుగబనిచేయుట కేర్పాటైనది;

కలకత్తా కార్పొరేషనువా రాయనను మరల 'ఆల్డరుమ ను'గ ఎన్నుకొనిరి. అప్పుడాయనవంగరాష్ట్రపు జాతీయనాయ కులతో నాలోచించి, వారిలోని పరస్పరభేదములను తొలగించి, అందరికినిసామరస్యము గల్గించినాడు.

అక్టోబరులో ఆయన బెంగాలులో కొంతరాజకీయప్రచారము సాగించెను. గాంధిగారును ఆయనయు కొంతసంప్రదించుకొనిరి. ఆయన ముందు దేశనాయకుడగుటకు తగినవాడని గాంధి మహాత్ముడు గ్రహించెను. ఆనవంబరులో సుభాషబోసు మరల యూరపుకేగి రెండునెలలక్కడనుండెను. అందుపైన ఆయన ఆరోగ్యము కుదుటబడినది. ఈరెండు నెలలలో, ఆయన తనరాజకీయానుభవములను విశేషసంగతులను 'ఆత్మకథ' రూపముగ వ్రాయదొడగెను. ఈలోగా 1938 ఫిబ్రవరిలోజరుగు కాంగ్రెసుకు సుభాషచంద్రునే అధ్యక్షునుగనుంచవలెనని చాలమంది సూచించిరి. గాంధిమహాత్ముడును ఈసారి సుభాషే 'రాష్ట్రపతి' కావలెననెను. ఆప్రకారము, తక్కినవియోజితులగు జవాహర్లాలు, అబుల్ కలాం అజాదు, ఖాన్ అబ్దుల్ గఫ్ఫారుఖాను గార్లు తమ అభ్యర్థితనువదలుకొనిరి. అంతట అన్నిరాష్ట్రసంఘముల వారును పోటీలేకుండ ఏకకంఠముగ సుభాషబోసునే ఈసారి అధ్యక్షుడుగ ఎన్నుకొనిరి.

ఆయన నింకను ఇంగ్లండుకు రానీయకుండుట అసంగతమగుటచే, ప్రభుత్వమువారు ఇప్పుడు సుభాషు ఇంగ్లండురావచ్చునని తెల్పిరి. కొందరాయననాహ్వానింపగా, జనవరిలో కొద్దిరోజులాయన లండనులో కార్మికనాయకులతోను భారతీయ




సుభాషబోసుకు 3 2 1938 తేదీని వార్ధాలో బజాజు, పటేలు, నెహ్రూ, మున్నగు వర్కింగుకమిటీ సభ్యుల సన్మానము.

నాయకులతోను విద్యార్థులతోను మాట్లాడి, ఉపన్యసించెను; తనపూర్వవిద్యాస్థలమగు కేంబ్రిడ్జిలో మిత్రులతోను భాషించి మరల వాయుయానముద్వారా 23-1-1938 తేదికి మనదేశ మునకువచ్చెను. అంతట సుభాషుకు కరాచీనుండి కలకత్తావర కన్నిచోట్లను దేశీయులత్యద్భుతమగు స్వాగతమిచ్చినారు. ఆయన కలకత్తాకురాగనే తనరాష్ట్రమందు కాంగ్రెసుపక్షములందున్న వైషమ్యములను తొలగించుటకును, రాజకీయ నిర్బంధితుల విడుదలకును ప్రత్యేకశ్రద్ధవహించెను. ఈ జనవరి 29-30 తేదీ లలో జరిగిన సమావేశమందు వంగరాష్ట్రమహాసభవారు ఈ రెండుసమస్యలను పరిష్కరించుట కాయనను ప్రత్యేకముగ నియోజించినారు అన్నిపార్టీలకును ఆయనయందే నమ్మిక యున్నది. అందుకాయన చాలకృషి చేయుచున్నాడు.

ఈసాలు జనవరిలో మద్రాసులో అఖిలభారతవిద్యార్థి మహాసభకూడినది. అందు రెండుకక్షలేర్పడి, విభేదములవల్ల ఆసభ విచ్ఛిన్నమైనది. విద్యార్థిసంఘములం దిట్టికక్షలుగలుట దేశమునకనర్థకరము. కాని, ఆరెండుకక్షలకు నెందరుబోధించినను సామరస్యముకుదరలేదు. తుదకు రెండుకక్షలవారును తమ విభేదముల బరిష్కరించుటకు సుభాషబోసుగారిని మధ్యవర్తిగ కోరుకొన్నారు. అందు కంగీకరించి, ఇప్పుడాయన ఆపరిష్కా రమునకు యత్నించుచున్నారు.

ఈఫిబ్రవరి 3 వ తేదీనుండి కాంగ్రెసువర్కింగుకమిటీ కార్యక్రమములో పాల్గొని, ఆసభ్యులతోను గాంధిమహాత్ము నితోను ఆయాసమస్యలగూర్చి ఆయనచర్చించినారు.

# 51వ (హరిపుర) కాంగ్రెసుసభ.

---

ఈ 1938 సాలు కాంగ్రెసు మహాసభ గుజరాతులో సూరతుజిల్లాలో 'హరిపుర'మువద్ద జరిగినది. ఇది సత్యాగ్రహ యుద్ధములో ప్రసిద్ధిజెందిన 'బర్డోలీ'కి 11 మైళ్లలోని పల్లెటూరు. దానికి రెండుమైళ్లదూరములో 'తపతీ' నదియొడ్డున పొలముల మధ్య సుమారు 600 ఎకరములమేర వెదురుతోను తాటాకుతోను వేలకొలది కుటుంబములకు వసతిగ కుటీరముల గట్టినారు. 'సూరతు' నుండి విద్యుచ్ఛక్తిని, తపతినొడ్డున నూతుల నుండి నీటిని, చుట్టుపట్లనుండి ఇతరవసతులను, ఏర్పర్చినారు. పాలకై 500 గోవుల నక్కడ నిలువయుంచినారు డేరాలు వగైరాలకు ఖద్దరు, భోజనమునకు గోధుమపిండి దంపుడు బియ్యము వగైరాలు ఆరునెలలనుండి తయారుచేసి లక్షల కొలది జనులకై నిలవజేయించినారు; ఆరోగ్యపద్ధతులను గ్రామజనులకు బోధయగునట్లేర్పర్చినారు. సుప్రసిద్ధకళాభిజ్ఞుడగు నందలాలు బోసుగారలంకారములుజేసిరి. ఈవిచిత్రపురముకు గుజరాతీదేశభక్తులలోముఖ్యుడు, కేంద్రసభకధ్యక్షుడు, సుభాషునకు యూరపులో మిత్రుడు కీర్తిశేషుడైన శ్రీ విఠలభాయి పటేలుగారికి స్మారకముగ 'విఠలనగర'మని పేరిడినారు. అందు స్వదేశవస్తువుల పెద్దప్రదర్శనమునకు 11-2-38 తేదీని గాంధి మహాత్ముడే ప్రారంభోత్సవము జరిపెను. ఇందు ముఖ్యముగ మంచిఖద్దరు, తేనె, పట్టు, రకరకములు బెల్లములు, వస్త్రపు

కమ్మరపువస్తువులు మొదలగు చాలరకముల గృహపరిశ్రమ వస్తువులు తయారుచేయు విధములగూడ కనపర్చినారు.

అంతట ఈసారి కాంగ్రెసుకధ్యక్షుడగు సుభాషబోసు కలకత్తానుండి 13-2-1938 తేదీని బర్డోలీచేరెను.

ఒకరాజుగారి ప్రాచీనరధము సుందరముగ నలంకరించి, దానికి వస్త్రశోభితమగు 51 ఎడ్ల నమర్చిరి. (ఇది 51 వ కాంగ్రెసు మహాసభ) అందు అధ్యక్షుడగు సుభాషబోసును, సన్మానసంఘాధ్యక్షుడు సత్యాగ్రహ యుద్ధమున తనజమీం దారీనంతను గోల్పోయిన త్యాగియు నగుదర్బారు గోపాల్దాసు గారును, ఆసీనులైరి. కాంగ్రెసు అధ్యక్షుని ఊరేగింపులో లక్షజనము పాల్గొనిరి. ఇట్లు సుభాషు విఠలనగరముచేరి గాంధిమహాత్ముని దర్శించి వర్కింగుకమిటీవారి కార్యక్రమములో పూర్తిగ పాల్గొనెను.

ఫిబ్రవరి 16 వ తేదీని అఖిలభారత కాంగ్రెసుసమితిసభ జరిగినది. అంతట సుభాషు అధ్యక్షాధికారము స్వీకరించి, విషయనిర్ణయసభలో చర్చల జరిపెను.

అంతట 19 వ తేదినుండి కాంగ్రెసుమహాసభజరిగినది. నాయకులును సుమారు రెండువేలప్రతినిధులును అసంఖ్యాకు లగు ప్రేక్షకులును విచ్చేసిరి. కొన్నిలక్షలమంది గ్రామజనులు వచ్చిచూచిరి. సుభాషబోసు, అమితోత్సాహము వ్యాపింప, రెండులక్షల జనుల సభలో సమర్థతతో నుపన్యసించి, ఆమహా సభ కార్యక్రమమును చాలజయప్రదముగ జరిపించినారు. అవసరమగు చాల తీర్మానములుజరిగినవి.

---

# 15. సుభాషుస్వభావము.

సుభాషబోసిప్పుడు 40 ఏండ్లవాడు; మన జాతీయ నాయకులందరిలోను చిన్న. ఆయన దేశసేవ, ప్రయోజకత, ఇకముందింకను హెచ్చుగ నుండవలెను. ఇప్పుడాయన తత్వ, స్వరూపముల గమనింతము.

సుభాషు వంగీయుల మధ్యవర్గపు కుటుంబమువాడు. ఆయనతండ్రి, సోదరులు, మేధావులే; కాని అందరిలో నతడే యెక్కువ త్యాగి, ధీమంతుడు. ఆయన మొదటినుండి జ్ఞానార్జన చేసినాడు. పరీక్షలలో (ముఖ్యముగ ఐ.సి.ఎస్. లో) తన ప్రతిభ కనపర్చినాడు; తత్వశాస్త్రమం దెక్కువ ప్రవీణుడు; జైలులో నున్నప్పుడు చిత్తరంజనదాసుగారికి తత్వశాస్త్రమును, నీతి శాస్త్రమును నేర్పెను.

సుభాషు బాల్యమున దృఢగాత్రుడే. కాని జైలులో నారోగ్యము చెడినది. మన నాయకులందరిలో సుభాషే యెక్కువ జైలుబాధ లనుభవించినవాడు. జైలులో గాంధి నెహ్రూలకన్న సుభాషుయందు సర్కారువా రెక్కువ కఠినులుగ నుండినారు. జైలులో వ్యాధిగ్రస్తమై, సుభాషుదేహము తరువాతగూడ వెంటనే పూర్తిగ కోలుకోలేదు.

సుభాషు మతవిషయములందును శ్రద్ధవహించెను; తల్లి (పార్వతీదేవి) తో బాల్యమందే మతసంగతుల జర్చించెను.

బంగాళీలో భక్తిరసగ్రంథముల జదివెను; విద్యార్థిదశలో సన్యాసి కాదలచి యాత్రచేసినసంగతిని గమనించినాము. కాని అప్పుడు, బాహ్యభక్తి బైరాగివేషము గలిగి మానులగుటకన్న, అంత శ్శుద్ధిగల్గి దీనుల నుద్ధరించుటే నిశ్శ్రేయసకరమని, భగవత్సేవ కన్నను భాగవతసేవ యెక్కువ యీశ్వరప్రియమని నిశ్చయించు కొన్నాడు; అప్పటినుండి ప్రజాసేవకై దీక్షవహించినాడు.

హిందూమతాభిమానియైనను, సుభాషు వన్యమతస్థుల ద్వేషింపడు. బెంగాలులో ముస్లిములసంఖ్య హెచ్చు. తరుచు హిందూముస్లిముల తగువులు వచ్చును. సర్వమతముల మూల సూత్రమొకటే; ఆచారభేదముల కెక్కువ ప్రాముఖ్యమిచ్చి కలహముకు దిగుట భావ్యముకాదని ఆయనభావము. ఉత్తర ప్రాంతమందీమతకలహమును మనప్రక్కను హిందువులలో నే కులతత్వములును ఉద్యోగాదులకును ఆయా ప్రభుత్వసభ లలో సభ్యతలకును పెనగులాటగ పరిణమించి, తుదకు రాజ కీయ కలహమగుచున్నవి. మనలో నీతగువువలన, బ్రిటిషు ప్రభు త్వపు బలము హెచ్చును; మన నిరోధశక్తి తగ్గును. కనుక మనది సోదరకలహమువంటిది. దానిని మనలో సఖ్యతతో పరిష్కరించుకొనుట తుదకుభయులకును లాభకరమని, సంఘీ భావమే బలమని, ఆయన గ్రహించెను. శ్రీదాసుగారు బెంగాలు కౌంసిలునాయకులైనప్పుడు కాంగ్రెసు ముస్లిముపక్షములకు రాజీకుదుర్చుటకు సుభాషు సాయపడెను. ఆ రాజీవల్లనే,

కాంగ్రెసువా రల్పసంఖ్యలో నున్నను, ప్రభుత్వమును చాల సారు లోడించి, అప్పటి ద్వంద్వప్రభుత్వపు విధానమును నిర్మూలము చేయించగలిగిరి.

ఇట్లే కలకత్తా కార్పొరేషనులో ఉద్యోగములకై హిందూ ముస్లిములమధ్య పెనుగులాటరాగా, సుభాషు ఔదార్యము చూపెను; ముస్లిములకు చాల ఉద్యోగములనిచ్చెను. అంతట ముస్లిములందరును కృతజ్ఞులై, కాంగ్రెసుకు సాయపడిరి. కాని సుభాషు జైలుకుపోయినతరువాత, క్రొత్తనిర్వాహకు లాసంప్రదాయమునకు వ్యతిరేకులైరి. మరల కలహమేర్పడినది. వంగరాష్ట్రపు కాంగ్రెసువారిలోను, విభేదమేర్పడినది. ఇప్పుడీపక్షులమధ్య భేదకారణముల బోగొట్టి, సామరస్యముకల్గించుటకు యత్నము చేయుచున్నారు.

రాజకీయముగ సుభాషు పూర్ణస్వాతంత్ర్యవాది. 'అధినివేశ' రాజ్యాంగమైనను బ్రిటిషువారు మనకెన్నడును తమంతట నీయరు; జాతి, మత, భాషాదులందు ఇంగ్లండుజనులకును కనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా వగైరా వలసలకును తల్లికొమార్తెలబోలు సంబంధమున్నది; ఆర్థికముగను అన్యోన్యలాభమున్నది. మనతోనట్లుకాదు; అన్నివిషయములందును పరస్పరము వ్యతిరేకమే. ఆవలసరాజ్యములలో తెల్లవారు మనలను అస్పృశ్యులుగ జూతురు. బ్రిటిషువారిదేశమందును మనలను సమానముగ జూడరు; వారి'క్లబ్బు'లలోను మనవారిని చేర

నీయరు. ఇట్టిన్ని విధములనువ్యతిరేకధోరణిలో నున్న వారి సామ్రాజ్యమందు మనకు 'డొమినియను' ప్రతిపత్తియుండుట ప్రకృతివిరుద్ధము. మనకళాసంస్కృతుల రక్షణకొరకును పూర్ణ స్వాతంత్ర్య మవసరమని సుభాషు భావము.

ఆయన బెంగాలులో 'ఇండిపెండెన్సులీగు'ను స్థాపించి, వ్యాపింపజేసెను. ఆయనకు యువకులందెక్కువ విశ్వాసము. నాగరికదేశములందు యువకులే ముందుకువచ్చి జాతీయకార్యముల సాధింతురు. యువకులఉత్సాహశక్తులపైననే భావికార్యములాధారపడును. కనుక ఆయన అంతటను యువకసంఘముల స్థాపించి, వారిచేతఖద్దరుప్రచారము, విదేశవస్తుబహిష్కారము, మద్యనిషేధము, అందుకవసరమగు పికెటింగు వగైరాలు తీవ్రముగజరిపించినాడు.

ఆయనత్యాగము అద్భుతము; 1920 లో ఐ. సి. ఎస్ ను 1924 లో కలకత్తా కార్యనిర్వాహకతను, 1931 లో మేయరు హోదాను, పోగొట్టుకొనెను; 1936 లో దేశసేవకై బుద్ధిపూర్వకముగ యూరపునుండి జైలునంగీకరించెను.

ఆయన తానునమ్మె సంగతులప్రియములైనను చెప్పివేయును; ఇతరులు మృదువుగ సూచించువానిని ఖండితముగ దేల్చును. నెహ్రూరిపోర్టునుగూర్చి గాంధీ మోతిలాలుగార్లు 1928 లో కలకత్తా కాంగ్రెసులో రాజీక తీర్మానముపెట్టిరి. కాని, మహాసభలో సుభాషు 'పూర్ణ స్వాతంత్ర్యమే లక్ష్య'మని

తెల్పుచు ఆశీర్వాదమునకు సవరణ నుపపాదించెను. దాసుగారి తరువాత తానే బెంగాలులో రాష్ట్రనాయకుడు కాదగినను, ఇట్టి ప్రవర్తనముచే కొంత వ్యక్తి తగువులు గల్గినవి. సేనుగుప్త గారే నాయకుడగుటకు గాంధీ మోతీలాలుగార్లు తోడ్పడిరి.

ఈ 1938 జనవరిలో 'లాన్సుబరీ, గ్రీన్వుడ్, ఆట్లీ, మున్నగు పెద్ద బ్రిటీషు కార్మికనాయకు ఆయనతో తీయనిమాటలు జెల్పుచు లండనులో నీయనకు సన్మానసభలు జేసి, తాము మనదేశమున కుపకారులైనట్లు నటించి, ఫెడరేషనుకు సాయము చేయించుకొనజూచిరి. అప్పుడాయన ఆ నాయకులందరును భారతదేశమునకింతవరకు ద్రోహమునే చేసిరనియు, వారియందును వారిసమ్మతితో తయారైన 'ఫెడరేషను' రాజ్యాంగమందును భారతీయులకెంతమాత్రమును నమ్మకము గౌరవము లేదనియు, లండనులో వారియెదుట సభలోనే స్పష్టముగ జెప్పెను. 1933 ఆగస్టులో గాంధిగారు హరిజనప్రచారముకై సత్యాగ్రహమాపుజేయించినప్పుడు, యూరపునుండి సుభాషు (విఠలభాయి పటేలుతో కలసి) ఆ చర్య యనర్థకమని మన పత్రికలకు తంతి నంపెను.

సామ్యవాద మాయనకిష్టమే. కాని జాతీయస్వాతంత్ర్యమును ముందుగా సాధించవలెను. జాతీయవ్యక్తిత్వ మున్నప్పుడే అంతర్జాతీయత; మన జాతీయతకు, విశ్వజనీనతతో సంఘర్షము లేదు. కనుక సామ్యవాదులును గాంధిగారి నిర్మాణకార్యముల నమలు జరుపవలెనని ఆయన కోరిక.

---

# 17. గాంధి, జవాహరు, సుభాషు.

ఇప్పుడు మన రాజకీయనాయకులు గాంధి, జవాహరు సుభాషు. వీరి ముగ్గురికిని ప్రక్రియఅభిప్రాయములు చాలవర కొకరీతివే. ముగ్గురు నాంగ్ల దేశమందు విద్య పూర్తిచేసినారు. ఇప్పుడునిగ్రహులై, ప్రజాక్షేమపరులై, మహాత్యాగులై, తదేక దీక్షతోనున్నారు. స్వరాజ్యము వెంటనే కావలెనని ముగ్గురును దృఢముగ కోరి, యత్నించుచున్నారు. కాని కొన్ని విషయము లందు దృక్పథములోను అమలులోను, స్వల్పభేదములున్నవి. సుభాషుకు గాంధికన్న జవహరుతో చాల పోలికయున్నది.

మనదేశముకు స్వరాజ్యము కావలెను, అనగా అన్ని విషయములతో బాటు ఆర్థిక ద్రవ్యసంగతులపైనను మన సేనలపైనను గూడ మన ప్రజాప్రతినిధిసభ కధికారముండవలెను, అని ముగ్గురు నందురు. ఐతే, ఇప్పటి డొమినియనులకును అట్టి అధికారమున్నది ; అందుకు బ్రిటిషువారు సమ్మతించి వీలైతే, అట్టి అధికారములతో మనమీ సామ్రాజ్యములో నుండవచ్చు నని, అట్లు బ్రిటిషువారు సరిపెట్టక బాధించేయెడల పూర్ణస్వా తంత్ర్యమే శరణ్యమని, గాంధిగా రందురు; 'డొమినియను' పద్ధతి మనదేశముకు వర్తింపదని, కనుక బ్రిటిషుసామ్రాజ్యము నుండి త్రెంచుకొని పూర్ణస్వాతంత్రము నొందుటే మనదేశపు లక్ష్యమని, జవహరు సుభాషులందురు. 'ఆధ్యాత్మికవికాసమే

మానవుల ఆదర్శము; అదిజాతీయ స్వాతంత్ర్యమున్నపుడే పూర్తిగసాగును. కనుక ఆధ్యాత్మికతకు సాధనముగనే రాజకీయ స్వాతంత్ర్యమును సాధింతుము. అందుకు మతాధారమగు అహింసమూలసూత్రము' అని గాంధి; 'ఆధ్యాత్మికతకు రాజకీయములకు ప్రత్యక్షసంబంధము కూడదు. స్వాతంత్ర్యము వట్టి సాధనమే కాదు. హింసాపద్ధతితోనే స్వరాజ్యము సాధ్యమగుచో, దాని నవలంబించుట తప్పుకాదు. కాని, ఇప్పటి మనదేశపు స్థితిగతులలో హింసాపద్ధతి కేవలము మనకు నష్టకరమేగాని యెంతమాత్రమును లాభకరముకాదు. కనుక సౌకర్యమునుబట్టి అహింసాపద్ధతియే మనదేశముకు తగినది' అని సుభాషు జవాహరులు. దేశమం దహింసను కాపాడి నిర్మాణకార్యములాయములు పూర్తిజేయుచో, మరల యుద్ధమక్కర లేకుండ కాంగ్రెసు మంత్రులద్వారా ప్రజాశక్తి హెచ్చి స్వరాజ్యము క్రమముగ తనంత లభించునని, గాంధిగారు; ఇప్పటి మంత్రులద్వారా కాంగ్రెసువారు మంత్రిత్వము వహించుటకు సిద్ధాంతరీత్యా సుభాషు జవాహరులు వ్యతిరేకులు: 'కాంగ్రెసు మంత్రిత్వమిప్పుడు కొంత లాభకరమైనను, ఇకముందు ప్రభుత్వ మిామంత్రుల కడ్డుదగులును. అప్పుడు సంఘర్షము తప్పదు. మరల అహింసాయుద్ధము జరుగవలసినదే' అని సుభాషు జవాహరులు.

ఖద్దరువాడుక మున్నగు నిర్మాణకార్యక్రమము పూర్తి చేసిన, రాజకీయయుద్ధ మక్కర లేకయే స్వరాజ్యము సిద్ధించు

నని, నిర్మాణకార్యము కొంతవరకైనను సాగనిదే సత్యాగ్రహాది రాజకీయయుద్ధముజరుపకూడదని, గాంధిగారు; 'నిర్మాణకార్యములిప్పుడు మంచివి, అవసరములు, నిజమే; కాని అవి బాగుగ వ్యాపించకున్నను, జనులలో నుత్సాహదీక్షలున్నచో రాజకీయయుద్ధము సాగింపవచ్చును, అని వీరలందురు.

మిల్లులు వగైరా కొన్ని ఆధునికయంత్రములపద్ధతి మన దేశమున కెన్నడును సరిపడదని, గ్రామములందు చేతిపనుల వృద్ధి జేసియే ఆర్థికమోక్షమును సాధింపవలెనని, గాంధిగారు; ప్రస్తుతముకంటే, కాని మనకు స్వరాజ్యము వచ్చినమీదట ప్రజాతంత్రపద్ధతిని ప్రభుత్వాధికారమున తగు కట్టుబాట్లతో యంత్రపరిశ్రమల వృద్ధిజేయుట లాభకరమే' అని వీరు.

వర్గసంఘర్షము' అనగా సంస్థానరాజులకును ప్రజలకును, జమీందార్లకును రయితులకును, మిల్లుయజమానులకును కార్మికులకును, పోరుజరుగకుండ వారలమధ్య ఆనుకూల్యమునే హెచ్చించి, శ్రీమంతులను తమ ఆస్తులకు ధర్మకర్తలుగ జేయవలెనని గాంధిగా రందురు. అనవసరమగు తగువులను పెంచకూడదుగాని కొంతవరకు వర్గసంఘర్షము తప్పదని, శ్రీమంతులకిప్పుడున్న హక్కులు చాలవరకు పోవలెనని, వీరలవాదము. సామ్యసూత్రములు నిర్మాణకార్యక్రమములో నిమిడియేయున్నవని, పాశ్చాత్యదేశములందున్న సామ్యవాదము మనదేశమునకసలే పనికిరాదని గాంధిగారు; రష్యాలోని పద్ధతులే మనదేశ

బెట్టుట తప్పే, కాని సామ్యవాదపు ముఖ్యసిద్ధాంతములు మంచివే; అయితే వాటిని మనదేశపు పరిస్థితులకు వీలగునట్లు మార్పుజేసుకొని వాడవలెనని సుభాషు జవాహారులు. సంస్థానములందు బాధ్యతాయుత ప్రభుత్వ మేర్పడవలసినదే; కాని ఇప్పటిస్థితిలో సంస్థానముల అంతరంగసంగతులలో కాంగ్రెసు కల్పించుకోకూడదని, రాజులకు బోధించియే సంస్కరణ జరిగించదగునని, గాంధిగారు; సంస్థానపద్ధతియే దోషయుక్తమని, ఆరాజుల కెంతబోధించినను, బూడిదలో పన్నీరుబోసినట్లగునని, దేశీయరాజ్యములందును కాంగ్రెసుసంస్థల స్థాపించి, కొంత ఒత్తిడిగల్గించవలెనని, సుభాషజవాహారులు.

ఇట్లు సుభాషు జవాహారుల భావములు కలియును. ప్రణాళికల నమలుజరుపుటలో కొద్దిభేదములుండును. జవాహరు విజ్ఞానవేత్త. సామాన్యపు మతధోరణిలేనివాడు; కొన్నియేండ్లు సంసారమందును న్యాయవాదివృత్తిలోను ఉండి గాంధిగారిననుసరించి త్యాగియైనాడు. సుభాషు తత్వశాస్త్రజ్ఞుడు, ఇంకను బ్రహ్మచారి, ఏవృత్తిలోనికిని దిగనేలేదు. కొంతవరకు మతమందరవిందు ననుసరించి, రాజకీయమున చిత్తరంజను కుడిభుజమైనాడు.

ఇంతవరకు, సుభాషు కొన్నిసంగతులందెక్కువ తీవ్రభావుడు. బ్రిటిషువారిపైన జవాహారుకున్నంత విశ్వాసముగూడ సుభాషుకు లేనట్లు తోచును. సుభాషు ఇంతవరకు

ఎక్కువ బాధలనుభవించినాడు. బ్రిటిషువారికి సుభాషుకు మధ్య ఇంతవరకు సారస్యము లేదు.

జవాహరు బాల్యమునుండి బ్రిటిషుదాదులు, ఉపాధ్యాయులు, తరువాత కొందరు బ్రిటిషుమిత్రులు నుండినారు. సుభాషుకు బ్రిటిషువారితో నెప్పుడును సంఘర్షమే కలిగినది. జవాహరు కన్న సుభాషు చిన్నవాడు, ఎక్కువఆవేశపరుడు. జవాహరుకు గాంధి మోతీలాలుగార్లతో నెక్కువ సాహచర్యముండినది; ఆ పక్షముతో నతనిద్వారా కొన్ని సందర్భములం దెక్కువసంబాధ మేర్పడి రాజీ జరిగినది. అనగా గాంధిపక్షీయులకును యువక సామ్యవాదులకును ఆయన సామరస్యము గల్పించినాడు. సుభాషుకు వారితో నట్టియన్యోన్యత కలుగలేదు. ఆయన ఇంత వరకును కేవలము యువకనాయకుడే. కానిరాష్ట్రపతియై దేశ నాయకుడైనమీదట చాలవరకు జవాహర్లాలురీతినే కార్యక్రమము జరిపింపవచ్చును. మొత్తము మీద జవాహర్లాలు తర్వాత రాష్ట్రపతిభారము వహించుటకు సుభాషే తగిన వాడని దేశమంతయు ఏకగ్రీవముగ అభిప్రాయపడుట న్యాయమే

# 18. మహారాష్ట్రమహాసభ. అధ్యక్షోపన్యాసము.

[మహారాష్ట్రుల రాష్ట్రీయమహాసభ 1928 లో పూనాలో జరిగినది. దానికధ్యక్షుడగు శ్రీ సుభాషబోసుగారప్పుడిచ్చిన ఉపన్యాససార మీక్రిందనీయబడినది. అప్పటి ఆయన భావము లిందు తెలియును.]

లోకమాన్య తిలకుగారు మహారాష్ట్రులకే గాక మన అందరి ముఖ్యనాయకులలో నొకరు. ఆయనమహత్వ మద్భుతము. దుస్సహమగు మాండలేజైలులో ఆరేండ్లుతపస్సుచేసి 'గీతారహస్య'ము నాయన రచించుటచుబట్టి ఆయన నిగ్రహమును ప్రతిభయు ఆజైలులో నుండిన నాకు వ్యక్తమైనవి.

మనభారతజాతికి స్వాతంత్ర్య మత్యవసరము; మనయాత్మను మనజాతీయపద్ధతినే వికసింపజేయవలెను. ఈరోజులలో జీవితవృత్తులన్నిటికిని రాజకీయములతో సంబంధమున్నది. ఆర్థికముగను, సాంఘికముగను నైతికముగను గూడ మనమువృద్ధియగుటకు రాజకీయముగ సంపూర్ణస్వాతంత్ర్య మవసరము. బ్రిటిషువారి కధీనులమై యున్నంతకాలమును మనఆర్థికస్థితి బాగుపడదు. ఈపరాధీనత మనకు నైతికముగను హానికరమే. అమూల్యమగు మనప్రాచీనసంస్కృతిని మనము కాపాడవలెను.

పాశ్చాత్యసంస్కృతిప్రభావమువలన మనకళలును సంస్కృతియు కల్తీయై వికృతినొందుచున్నవి. మనకళలకు జాతీయతకు ప్రత్యేకతయున్నది. అవి 'సత్యం శివం సుందరం' అను సిద్ధాంతముపై నాధారపడినది. విదేశీయుల ప్రాబల్యముపోయి పూర్ణస్వాతంత్ర్యముకలిగినప్పుడుగాని మనకళలు పూర్తిగ వికసించవు. కనుక రాజకీయధోరణి లేకున్నను, మనకళాభిమానులును సంస్కృతిప్రియులునుగూడ తప్పక కాంగ్రెసులోజేరి జాతీయస్వాతంత్ర్యప్రయత్నములకు తోడ్పడవలెను; లేనియెడల మన కళావికాసముకు నిజమగుసేవ జేయలేరు.

పూర్వమీదేశమందు ప్రజాతంత్రపు పాలన మామూలు లేదని కొందరందురు. ఇదితప్పు; పూర్వకాలమందు ప్రజాప్రతినిధులే పాలించిన 81 గణరాజ్యములుండినట్లు శ్రీజయస్వాలుగారు 'హిందూపొలిటీ' అనుగ్రంథములో వ్రాసినారు. మనదేశమందు పూర్వపు గ్రామపంచాయతీలలోను అస్సాములోని ఖాసీలు మొదలగు అనాగరికసంఘములలోను ప్రజాతంత్రపద్ధతియు 'కమ్యూనిష్టు' పద్ధతి పాలనగూడ ఉండినవి.

ఐతే, ఇప్పటి మన సామ్యవాదులు కొందరు తమ కన్నిజాతుల పనివాండ్ర క్షేమము కావలెనని, అంతర్జాతీయతకు మన జాతీయత అడ్డమువచ్చుననియు, భ్రమపడుచున్నారు. మన సంఘముకు ప్రస్తుతస్థితిమారి, పునర్నిర్మాణము కావలెను. ఇప్పుడు వర్గసంఘర్షమున్నది. నిజమే. కాని, ఇప్పుడు అందర

మును బానిసలము. సంఘపునర్నిర్మాణము జరుగుటకు ముందుగా విదేశీయుల అధికారమునుండి దేశము బయటపడవలెను. ఆతరువాతనే పునర్నిర్మాణము సాగును. ఈలోగా వర్గసంఘర్షము హెచ్చించి, కలహము పెంచుకొనుట ద్రోహకరము, విదేశీయులకు లాభకరము.

జాతీయత స్థిరపడినమీాదటనే అంతర్జాతీయతవచ్చును. కొందరు కమ్యూనిస్టులు కార్మిక నాయకులు అంతర్జాతీయత అనుపేర విదేశవస్త్రముల వాడుకనుగూడ ప్రోత్సహించుచున్నారు. ఇది మహాఘోరము. మనదేశపు జాతీయతకు అంతర్జాతీయతకును సమన్వయమే, సంఘర్షములేదు. రష్యావెుదలగు సామ్యవాది దేశములందును ఇప్పుడట్లే యున్నది.

ఇంకొకసంగతి. మనదేశము ప్రపంచమంతటికిని సంగ్రహమువంటిది. ఇందు ప్రపంచసమస్యల బీజము లున్నవి మన ఆర్థిక సాంఘిక సమస్యలను మనదేశములో సవ్యముగ మనము పరిష్కరించుకొనే యెడల, ప్రపంచసమస్యల పరిష్కారముకును మార్గదర్శకుల మగుదుము.

మనలోనెవరికిని నిజమగు స్వేచ్ఛలేదు. రాజకీయస్వాతంత్ర్యమువచ్చిన గాని ఆర్థికస్వాతంత్ర్యము సాధింపలేము.కనుక, అందరును కాంగ్రెసులోజేరి దేశముకు మోక్షము సంపాదించుడు. ప్రజాక్షేమపరులందరును ఖద్దరునే ధరింపవలెను. అదే బీదలకన్నము బట్ట నిచ్చును. దిక్కులేని ప్రజల రక్షించుటే కాంగ్రెసు

ముఖ్యధర్మము. స్వాతంత్ర్యమువల్ల పరమానందము జనించును. దానితో మనము మనకును లోకమునకును గూడ మహాకార్యములను సాధింపగలుగుదుము.

సాంఘికార్థికలోపములు తీరనిమీద నే మనముస్వరాజ్యము తగుదుమని విదేశీయులందురు; కాని, వాటి సంస్కరణ లకడ్డమగుదురు. నిజముగా సంఘమంతటను స్వరాజ్యేచ్ఛ గట్టిగ కలిగిననే, స్వరాజ్యార్హత యేర్పడును. కాని, మన వికాసము సర్వతోముఖము కావలెను. జన్మవలన కొన్ని కులములవారధికులని, కొందరు పతితులని, సాంఘికముగ విభేదముల బెట్టుకొని, రాజకీయముగ సమానత్వము కావలెననుట అసంగతము. మతమూర్ఖత వదలవలెను.

మనభారతసంస్కృతి కాలవాహినిలోని మహాప్రవాహమువంటిది. ఇందు ముస్లిం పార్సీ మున్నగు ఎన్నియో ఉపనదులు కలసినవి. మనము చారిత్రదృష్టితో వాటినన్నిటిని సమన్వయించవలెను. సనాతనమై అమరమైన భారతజాతియే సాధింపదగును. సర్వసంస్కృతులు సమన్వయమును.

ముఖ్యముగ మన స్త్రీలును యువకులును జాతీయభావముగల్గి, ఉదారభావముతో దేశము నుద్ధరించుటకు దీక్షవహించవలెను.

మనకు స్వతంత్రత పట్టిసాధనమే కాదు; అదే మనగమ్యము, సంపాద్యము. దాని వెలకు మితిలేదు. నరు డూపిరిపీల్చు

టకు ప్రాణవాయు వెట్లవసరమో, ఆత్మవికాసముకు స్వేచ్ఛయు నట్లేయవసరము. శ్రీవివేకానందుడన్నట్లు 'స్వాతంత్ర్య మాత్మగానము.' అది యీలోకపుఅమృతము.

స్వరాజ్యమే సర్వబాధానివారిణి. స్వాతంత్ర్య మేప్పుడ నప్పుడే మనబాధలు హరించును. దానిని సాధించుటకై ప్రతిచోటను కాంగ్రెసుసంస్థలను బలపర్చి, వాటిద్వారా, అధికారులేర్పర్చిన ఆయాసభలన్నిటినీ ఆక్రమించి, విదేశప్రభుత్వముతో అన్నివైపులనుండియు పోరుసాగించవలెను; విదేశవస్తువుల బహిష్కరించవలెను; గ్రామసంఘముల నుద్ధరించి వాటిద్వారా పనిచేయవలెను. అప్పుడు తప్పక స్వాతంత్ర్యమువచ్చును.

---

# 19. కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము.*

---

స్వాగతసంఘాధ్యక్షా, మిత్రులారా,

ఈసాలకు భారతజాతీయకాంగ్రెసుకు నన్నధ్యక్షునిగ నెన్నుకొని గౌరవించినందుకు నేనెంతయు కృతజ్ఞుడను. ఆ మహా గౌరవమునకు నేను తగను. ఇది మీకు నాయందున్న అనురాగమునకును, మనదేశపు యువకులం దాదరమునకునే, చిహ్నమని నా భావము. వారుకలసి జాతీయయుద్ధము సాగించనిచో, మనమింతవరకు వచ్చియుండము. మన మాతృభూమియొక్క గొప్ప పుత్రపుత్రికారత్నము లలంకరించిన యీ పీఠము నెక్కుటకు నాకు జంకగుచున్నది. నా లోపములనేకములు; మీసానుభూతిసహాయములతో మీ రప్పగించిన యీ మహోద్యోగ కార్యమును కొంచెమైనను నిర్వర్తింపగలనని నా నమ్మిక.

ఆరంభమున, శ్రీమతి స్వరూపరాణి నెహ్రూ, సర్ జగదీశచంద్రబోసు, డా॥ శరచ్చంద్రచటర్జీ, గారల మరణమునకు మన యఖండదుఃఖమును తెల్పెదను. పండిత మోతీలాలుగారి పత్ని జవహర్లాలుగారి తల్లి అగుటేగాక, స్వరూపరాణిగారు

---

*సుభాషుబోసు 19-2-1938 తేదిని హరిపురకాంగ్రెసుకధ్యక్షునిగ హిందీలోనిచ్చినయొపన్యాసము; అక్కడక్కడ కొంచెముగ క్లుప్తము చేయబడినది.

దేశస్వాతంత్ర్యముకై మహాబాధలబడి, అఖండత్యాగము చేసినది-తోటి దేశభక్తులగు మనము శోకముతో పండిత నెహ్రూకును, వారి కుటుంబమునకును, మనసానుభూతిని త్తము. ఆధునిక వైజ్ఞానికలోకమందీ దేశమునకుచితస్థానమును సాధించిన ఘనులలో సర్ జగదీశచంద్రబోసే ప్రథముడు. ఆదేశభక్తుడు విజ్ఞానమునే గాక మాతృదేశమునుగూడ సేవించినందుకు కృతజ్ఞులము.

డా॥ శరచ్చంద్రచటర్జీ యకాలమరణముచే మన వాఙ్మయాకాశమందుజ్జ్వలమగు మహాతార యంతరించినది. బెంగాలులోని ప్రతిగృహమందేగాక, భారతదేశమందంతటనుగూడ ఆయనపేరు వ్యాపించినది. సాహిత్యప్రేమనుగూడ మించిన దేశభక్తిగల యీ మహనీయుమృతిచే వంగరాష్ట్రకాంగ్రెసులో గొప్ప లోపమేర్పడినది. వారి కుటుంబమునకు మన సానుభూతి.

క్రిందటి ఫెయిజ్‌పురకాంగ్రెసు తరువాత మనదేశమునకై ప్రాణమిచ్చిన వీరులకు నా నమస్కారములు. ఖైదులో నో, శిక్షలేకుండ నిర్బంధములోనో, విడుదలమైన తరుణములోనో, పోయినవారిని స్మరింతును. అందులో, ఇటీవల ఢాకా జైలులో ఉపవాసదీక్షతో పోయిన రాజకీయబందియగు హరేంద్రనాథముస్షీముఖ్యముగ స్మరణీయుడు. దీనిచే నాహృదయమింకను విదీర్ణమై, ఏమియు చెప్పలేకున్నాను. జతీన్‌దాసు, సర్దారు మహావీరసింగు, రామకృష్ణనామదాసు, మోహిత మోహనమైత్ర, హరేంద్రముస్షీ మున్నగు వృద్ధికి రాదగు

ధీమంతు లెందరో ఇట్లు జీవించుటకన్న చావే మేలని నిశ్చయించి రన్న, ఇట్టిపరిస్థితిలో నేదో కుళ్ళు ఉండితీరవలెనుగదా!

మానవచరిత్రలో ప్రాచ్యపాశ్చాత్యములంతటను, ఎన్నియో సామ్రాజ్యములు విస్తరించి, మహోన్నతములై, అంతట క్షీణించినవి, కొన్ని యంతరించినవి. రోమకసామ్రాజ్యము, ఆస్ట్రియాహంగరీ, టర్కీసామ్రాజ్యము, మనమౌర్య, గుప్త, మొగలు సామ్రాజ్యములు నిందుకుదాహరణములు. అట్టిచో బ్రిటిషుసామ్రాజ్యముగతి మరొకరీతియగునని యెవరైన నొక్కి చెప్పగలరా? ఆ సామ్రాజ్య మిప్పుడొక క్లిష్టపరిస్థితికి వచ్చినది. ఇక నదివెనుకటిసామ్రాజ్యముల దారినైన బట్టును; లేదా, స్వతంత్రజాతుల సంఘమైన కావలెను.

1917 లో 'జారు' గారి సామ్రాజ్యముపోయి, సోవియటు సామ్యవాదిరాజ్యసంఘ మేర్పడినది. రష్యాకథచూచి, బ్రిటిషువారు నేర్చుకోవలెను. అట్లుచేతురా! రాజకీయముగ బ్రిటిషుసామ్రాజ్యము సంకరమైనది. అందు కొన్ని స్వపరిపాలకములు, కొన్నియరగొరగానున్నవి, కొన్నిబొత్తిగ నిరంకుశపాలనములోనున్నవి. యుక్తితో బోటుపెట్టి, ఈమిశ్రణనుకొంతకాలము నిలబెట్టవచ్చును. కాని ఇల్లెల్లకాలముసాగదు. ఇందుల అసందర్భములను సకాలమున తొలగింపనిచో, బయటి దెబ్బ తగులకున్నను, అంతస్సంఘర్షమువల్లనే ఈ సామ్రాజ్యము క్రుంగితీరును. కాని బ్రిటిషుసామ్రాజ్య మొక్కసారి స్వతంత్ర

6

జాతుల సంఘముగ మార్పు ధైర్య మాంగ్లేయులకున్న దా? అందుకు బ్రిటను సామ్యవాదియై, వారి స్వదేశమందే స్వేచ్ఛ యేర్పడవలెను. బ్రిటనులోని పుంజీపతితత్వపు పాలకవర్గముకు ను వారి వలస రాజ్యములకును అభేద్యసంబాధమున్నది. 'అనేక జాతులకు దాస్యముగల్గించినందుకు, బ్రిటనులోను నిరంకుశత హెచ్చును" అని వెనుక 'లెనిను' గారనిరి. ఖండాంతరములందు వలస బానిసదేశములసారము పీల్చుటవలననే, బ్రిటిషు అధి కారివర్గము వృద్ధియగుచున్నది. అవి స్వతంత్రము కాగనే, బ్రిట నులోను పుంజీపతులపాలకవర్గముకూలి, సామ్యరాజ్య మేర్ప డును. అది లేకుండ సామ్యరాజ్యమేర్పడదు. మన పరాధీన రాజ్యములు స్వతంత్రతకై పోరుటవలన, బ్రిటిషుబీదలకు వార్థిక స్వాతంత్ర్యమేర్పడును. 'విభజించి పాలించు' టే సామ్రాజ్యపద్ధతి. దీనిని బ్రిటిషువా రధికప్రజ్ఞతో; అవిచ్ఛిన్నముగను, నిర్దాక్షి ణ్యముగను, జరిపియున్నారు. ఈపద్ధతినే, (ఐరిషువారికధికారమి చ్చుటకుపూర్వము)అల్స్టరును తక్కినఐర్లండునుండి చీల్చిరి ఇట్లే పాలస్టైనువారి కధికారమిచ్చుటకుముందు, యూదుల సరబ్బుల నుండి వేరుజేతురు. ఇచ్చిన అధికారమును వ్యర్థముచేయుట కం తర్విభేదములుకల్పింతురు. క్రొత్తభారతరాజ్యాంగములోను ఈ ప ద్ధతి బెట్టినారు. ఆయా సంఘముల విడదీసి, విడిగ అమర్చినారు; ఫెడరలు (=సంసృష్టి) పద్ధతిలో నిరంకుశరాజులకు ప్రజాయత్త రాష్ట్రముల ప్రతినిధులకు ముడిబెట్టినారు. మనరాష్ట్రముల

యోటంకములవల్లనో, సంస్థానరాజులు వెనుదీయుటవల్లనో, ఈఫెడ రలుపద్ధతి భగ్నమైనను, భారతనిభజనకై బ్రిటిషువారు యుక్తితో మరొక రాజ్యాంగమున్మెట్టి, మనవారికిచ్చు అధికారము నిస్సారముగ జేయజూతురు. ఇంగ్లీషు ప్రభుత్వమువారిచ్చు యే రాజ్యాంగమునైనను చాల జాగ్రత్తతో బరీక్షించవలెను.

కాని, ఈ మిత్రభేదపద్ధతిచే మన పాలకులకును కొన్ని క్రొత్తసమస్యలు, బాధలును, వచ్చును. ఈపద్ధతిచే రాజకీయముగ ద్వంద్వకయేర్పడి, బ్రిటిషువారావలితో చిక్కుచున్నారు. మన దేశమందు సంతోషపెట్టుట, ముస్లిములనా, హిందువులనా? పాలస్టీనులో తృప్తిపరచుట యూదులనా, అరబ్బులనా? 'ఇరాకు'లో బుజ్జగించుట అరబ్బులనా కుర్దులనా? ఈజిప్టులో అనుకొనుట 'ఫరూకు' రాజుగారినా? 'వాఫ్దు'ల పక్షమునా? విదేశపద్ధతిలోను వారికీద్వివిధత యున్నది: స్పైనులో న్యాయ్యప్రభుత్వమును ఫ్రాంకోరాజ్యమును మధ్యగ బ్రిటిషురాజనీతిజ్ఞులు త్రొక్కాడుచున్నారు. ఫ్రాన్సు జర్మనీలమధ్య నెటు వంగుటకును తోచదు. బ్రిటిషుసామ్రాజ్యపు తిలతంతుల విరాశ్రణమే బ్రిటిషువారి విదేశాంగనీతిలో అసందర్భమునకు అన్యోన్య విఘాతమునకును కారణము. ద్రవ్యవిధానము యూదులచేతులందున్నది; కనుక, బ్రిటిషు ప్రభుత్వమువారు యూదులకు తృప్తి నీయవలె; మనదేశమందును ఇరాకు మున్నగు సమీపప్రాచ్యములందును తమకు సంబంధమున్నందున అరబ్బులకును కలత

రానీయకూడదు. బ్రిటీషుపాలకులిట్టి యవకతవకలనుండి బయట పడుటకు, తమ సామ్రాజ్యమును స్వతంత్రరాజ్యముల సంఘముగ జేయుటే ఉపాయము. అట్లుచేయుట యద్భుతకార్యమే. కాని తప్పినచో, రవి యస్తమింపడనెడు మహాసామ్రాజ్యము 'ఆస్ట్రోహంగరీ' వలె ముక్కలగుట కొప్పుకోవలెను.

బ్రిటీషుసామ్రాజ్యమందిప్పుడు పడమట ఐర్లండులో, తూర్పున భారతమందు, మధ్యను ఈజిప్టు పాలస్తీను ఇరాక్కులలోను, చిక్కులున్నవి. ఇక విదేశములందు మధ్యధరాప్రాంతమందిటలీయు, దూరప్రాచ్యమున జపాను, ఈరెండు సామ్రాజ్యములు కయ్యముకు కాలుదువ్వుచున్నవి. ఈఅశాంతికితోడు, సోవియటురష్యాను తలచుకొనగనే ఈసామ్రాజ్యపాలకులందరికిని సింహస్వప్నము.

'సముద్రములరాణి' అనుబిరుదింక బ్రిటిషురాజ్యముకు వర్తించునా? సముద్రాధికారమువల్లనే 18, 19 వ శతాబ్దులలో వారికంత యున్నతిగల్గినది. కాని, ఈ 20 వ శతాబ్దిలో లోకచరిత్రలో వాయుబలము ప్రధానమైనది. దానివల్లనే యుద్ధసన్నద్ధమైన బ్రిటిషునౌకాదళమును మధ్యధరాప్రాంతమందిటలీ పొగరుతో ధిక్కరించినది. బ్రిటిషువారు నేల, సముద్రము, ఆకాశము, అంతటను ఆయుధబల మెంతైన హెచ్చింపవచ్చును; పైనుండి బాంబులుపడినను, యుద్ధనౌకలు నిలువవచ్చు; కాని ఇప్పటియుద్ధములో వాయుబలము ముఖ్యము. దూరబాధలేదు.

విమానముల కడ్డముగ నెన్నిరక్షణలబెట్టినను, యూరపువారి శాంబులవర్షమునుండి లండనును రక్షింపవీలులేదు. ఇప్పుడు బ్రిటిషువారిప్రత్యేకత హరించినది. లోకరాజ్యములందు బలములు సమముగజేయుపద్ధతి యిక పనికిరాదు. ఇప్పుడీమహారాజ్యపుమొండిచేయి బయటపడినది.

ఈలోకశక్తులవ్యాప్తిలో మనదేశపుశక్తి వెనుకటికన్న హెచ్చినది. మనదేశము విశాలమై 35 కోట్ల జనులు గలది. అది దౌర్బల్యమనుకున్నదే (ఐకమత్యములో పాలకుల నెదుర్కొన్నచో) మనకు బలకారణమగును.

బ్రిటిషుభారతము, సంస్థానభారతము, అను విభేదము కృత్రిమము. భారత మొకేదేశము. భారతీయులందరియాశయమును స్వతంత్రభారతమే. రాష్ట్రములును సంస్థానములును భాగస్వాములుగ 'ఫెడరల్ రిపబ్లికు'(=సంసృష్టప్రజాతంత్రము) కావలెను. సంస్థానములందు ప్రజాయత్తతకు కాంగ్రెసువారు చాలసార్లు సానుభూతి చూపినారు.ఇప్పటి పనితొందరవల్ల కాంగ్రెసు సంస్థానములందు సాయపడకున్నను, వ్యక్తులు సంస్థానప్రజలకు తోడగుట కభ్యంతరములేదు. సంస్థానప్రజల యుద్యమమందు వారికి బాగుగ తోడ్పడుట కాంగ్రెసులో నాబోటికొందరి కిష్టమే. కాంగ్రెసుసంస్థ త్వరలో నిట్టిసాయ మొనర్ప వీలుకావలెనని నాకోరిక. వారికిమనసానుభూతి, సాయము, కావలెను. ఇక మైనార్టీల (=చిన్నసంఘముల) సమస్య. చిన్నసంఘముల హక్కుల

రక్షించి, వారు మనయార్థిక రాజకీయములలోను సంస్కృతిలోను పాల్గొని వృద్ధియగుటకు కాంగ్రెసు పూర్తిగ అవకాశమిచ్చును. ఐక్యముగల స్వతంత్ర భారతమును స్థాపించి, అందొకవర్గమింకొక దానిని స్వార్థముకై పీడించకుండ, అన్నికక్షులు ప్రజలందరిక్షేమముకై కలసి కృషిసల్పించుటే కాంగ్రెసుఉద్దేశము. కాని వారి వారి ప్రత్యేకతకును సంస్కృతివిశేషములకును భంగములేకుండ, వాటివికాసమునకు పూర్ణావకాశమిత్తుము.

"మనదేశపు ప్రతిపౌరునకిని భావప్రకటనకు, సంచారముకు, అవినీతిలేనికార్యములకై నిరాయుధులై న్యాయసమావేశములచేయుటకును, పూర్ణాధికారముండును. ఆప్రకారము ప్రతివాడును తనమతభావములమలుజరుపుకొనవచ్చును: తమ ప్రత్యేకసంస్కృతి, భాష, లిపి, రక్షణకును బాధలేదు. ఆయా జాతిమతములవారిపైన చట్టములోను ఉద్యోగగౌరవవ్యాపారాదులకును విభేదముల నుంచము. ప్రభుత్వము జరుపు బడులు చెరువులు నూతులు, బాటలువగైరాల వాడుకలో జాతికుల విభేదములుండవు. మతపక్షపాతముండదు. ప్రతివయస్కునికిని వోటుహక్కుండును. ఎవరైన తమకిష్టమగుచోట వసించి, ఆస్తి సంపాదించుకొని, వృత్తుల జేసుకోవచ్చును; న్యాయవిచారణలోను విభేదముండదు" అని మూలాధికారతీర్మానమందే స్పష్టముచేసి యున్నది. కనుక చిన్నసంఘములవారి కెట్టిభయము నక్కర లేదు.

కమ్యూనల్ అవార్డు*(=సాంఘిక పరిష్కారము) ను గూర్చి కాంగ్రెసు అభిప్రాయ మిదివరకే తెలియున్నది. ఈ 'అవార్డు' జాతీయతకు, ప్రజాయత్తతకు, ఐక్యముకు మనస్వాతంత్ర్యముకు గూడ, భంగకరము. కనుక అది కాంగ్రెసు కిష్టముకాదు. కాని అందులో మార్పును పరస్పరాంగీకారముతోనే జరిగింతుము. అట్టి సంప్రతింపులకు కాంగ్రెసెప్పుడును సిద్ధమే; చిన్నసంఘములకు సంబంధించుసంగతులలో వారి సానుభూతితోనే చరించుచు, అందరియాదర్శముగు దేశస్వాతంత్ర్యముకై పోరుదుము. జాతీయతాసూత్రములకులోబడి, ఈసాంఘికసమస్యను సీదాగా నిప్పుడు పరిష్కరింపయత్నింతము. ఇందునుగురించి ఇదివరలో కొంతమంచిపని జరిగినది. ఈసాంఘికవిభేదముల త్రెంచుటకు మన యార్థికరాజకీయావసరములకు ప్రాముఖ్యమిచ్చుటే మార్గము; అట్లుచేయుచు, మతవిషయములందన్యోన్యసానుభూతి గలిగియుందుముగాక. ఈ 'చిన్నసంఘముల' సమస్యలో ముస్లిములేగాక, నిమ్నజాతులు వగైరా తక్కినసంఘములవారికిని, న్యాయముజేయుటే కాంగ్రెసుఉద్దేశము. కాంగ్రెసుప్రణాళిక భారతీయులందరిక్షేమము నుద్దేశించునది. దానిఅమలువలన చిన్నసంఘములవారికిగూడ లాభమే. మరియు, మనకు రాజకీయాధికారము వచ్చినమీదట, సామ్యపద్ధతినే జాతీయపునర్ని

* ఆయారాష్ట్రాదులందు శాసనసభలలో హిందూ,ముస్లిం, సిక్కు-యూరపియనుల కెవరికెన్నిస్థానములుండవలెనో వారియెన్నికయెట్లు జరుగవలెనో బ్రిటిషుప్రధాని 1932 లో చేసినపరిష్కారమే 'కమ్యూనల్ అవార్డు'.

ర్మాణము జరుగునని నాభావము. అప్పుడు ప్రజాసామాన్య
ముకే లాభముగల్గును. మతసంస్కృతివిషయములందు కాంగ్రె
సువారన్నిసంఘములకును స్వేచ్ఛనిత్తురు; కనుక, అందుకును
కొద్దిసంఘములవారు కాంగ్రెసునుండి భయమొందనవసరము
లేదు. ఆయాభాషాప్రాంతముల ప్రత్యేకసంస్కృతినిగూడ కా
పాడుదుము. దేశస్వాతంత్ర్యమువలన ముస్లిములకును లాభమే
గాని నష్టముండదు. ఇక నిమ్నజాతులకును ఈ 17 ఏండ్లలోను
కాంగ్రెసు యథాశక్తిగ సాయమే చేసినది. కొద్దికాలములో
వారి ప్రత్యేకకష్టములు హరించిపోవును.

ఇక భావిస్థితిసంగతి. స్వరాజ్యసాధనకు మార్గము సత్యా
గ్రహమే; అనగా అహింసాపద్ధతిని, శాంతశాసనధిక్కారము
సహా, అన్నివిధముల అసహకారము సాగించుటే. 'సత్యాగ్రహ'
మున మందనిరోధమేగాదు; అందు తీవ్రనిరోధమును చేయును.

ఈ స్వాతంత్ర్యపుపోరు సాగుచుండగా, మధ్య లభించు
స్వల్పాధికారముల నుపయోగించుకొనవచ్చును; లేదా, మాన
వచ్చును. ఇందు సిద్ధాంతబాధ లేదు. మనలాభమే ప్రధానము.
మనప్రగతి పూర్తియైనప్పుడు మనకు బ్రిటిషుసంబంధమువదల
వలెను. అలంకె వదలి నిజమగు స్వయనిర్ణయము రాగనే వా
రును మనము నిష్టముతో మైత్రిసంధి నేర్పర్చుకొనవచ్చును. అది
యంతయు బ్రిటిషువారిధోరణినిబట్టియుండును. 'ఈరు' (=ఐర్లం
డు) అధ్యక్షుడగు డివాలెరాగారన్నట్లు మనకు బ్రిటిషువారితో

ముండుసంబంధమున మనకు స్వేచ్ఛయుండవలెననియే ఇప్పుడు వారితో పోరుచున్నాము.

ఇక జాతీయయుద్ధచరిత్రలో కాంగ్రెసుకార్యము. స్వాతంత్ర్యము లభించగనే కాంగ్రెసు పనిపూర్తికాదు. స్వాతంత్ర్యము సంపాదించుపక్షమువారే యుద్ధానంతరపుకార్యక్రమమునాత నుఅమలుజరుపవలెను. మరొకరు చేసినచో,ఆదర్శములు భేదించును.క్రాంతికరమగు నిర్మాణముజరుగను.స్వల్పమగు రాష్ట్రీయపాలనలోగూడకాంగ్రెసుమంత్రులకు తక్కినమంత్రులకు భేదముండుట కదేకారణము. యూరపులోను అధికారము సంపాదించినవారేనిర్మాణకార్యము బాగుగజరుపుచున్నారు. అట్లైనచో కాంగ్రెసును జర్మనీలోని నాజీపార్టీవలె నిరంకుశమగునని కొందరనుచున్నారు. కాని రెంటికిని భేదమున్నది. మనదేశమందితరపక్షములు నుండవచ్చును; మరియు మనపక్షము నాజీలవలె వ్యక్తిపై నేర్పడక, ప్రజలపై నాధారపడినది; ప్రజలే మన నాయకుల నెన్నుకొందురు.

తరువాత సంఘనిర్మాణ మెట్లుండవలెను? ప్రజల దరిద్రత, నిరక్షరత.వ్యాధి,పోవలెను;వస్తువులఉత్పత్తివ్యాప్తి విజ్ఞానపద్ధతిని జరుగవలెను; అందుకు సామ్యవాదపద్ధతియే మంచిది. స్వరాజ్యమురాగనే, మనజాతీయప్రభుత్వమువారు నిర్మాణకార్యముల విశాలముగ జరిగించుటకు ప్రణాళికకై, ఒకసమితి నేర్పరచవలెను. అందు కొంత వెంటనే జరుగునది; కొంత నిదానము

మీాద జరుపవలసినది. జనులకు స్వార్థత్యాగము నేర్పి, ఐక్యము గల్గించి, ప్రాంతీయసంస్కృతుల వృద్ధిజేయుట, వెంటనే జరుపవలసినవి. ఇందు పరస్పరవిరోధము లేదు.

విదేశీయు లింక మనపై దండయాత్రజేయకుండ, ఆత్మరక్షణ కైక్యము, బలమైన కేంద్రప్రభుత్వమును, కావలెను. కాని, ఆయాప్రాంతముల ప్రభుత్వములకు,అల్పసంఘములకును, ప్రత్యేకవికాసము కవకాశ మీాయవలెను. ఇంతకాలము విదేశీయపాలన జరిగి, సంఘము భిన్నమైనది; కనుక ఐక్యముగల్గించవలెను.

జాతియైక్యమునకు, సామాన్యభాష యేకలిపి కావలెను. వాయుయానము, టెలిఫోను, రేడియో, ఫిల్ములు, టెలివిజను వగైరా సాధనములతోను, సామాన్యవిధానముతోను, జనుల ఐక్యభావము హెచ్చింపవలెను. హిందీ ఉర్దూలవిభేదము సహజముకాదు చాలమంది వాడెడి మధ్యరకపుభాషయే సామాన్యభాషకావలెను. ఈసామాన్యభాషను నాగరి ఉర్దూలందో ఇష్టప్రకారము వాడవచ్చును. ఇందొకలిపియే యుండవలెనను నిర్బంధము కూడదు. కాని వైజ్ఞానికముగ చారిత్రకముగ జూచినచో, లోకమంతటవ్యాపించియున్న †రోమకలిపినే తుదకు మనమును వాడుట మంచిదగును.

---

† ఇంగ్లీషు అచ్చుచిన్నఅక్షరముల లిపిని రోమకలిపి యందురు. యూరపియనుభాషలన్నిటి కిదేలిపి.

ఇప్పటి 'నాగరి'లో పూర్వమెన్నియో మార్పులు జరిగినవి. చాలవరకు మనపెద్దరాష్ట్రములందు వేర్వేరు లిపులున్నవి. పంజాబుసింధులలో హిందూముస్లిములును తక్కినచోట్ల ఉర్దుభాషకులును ఉర్దులిపి వాడుచున్నారు. ఈకి పరిస్థితిలో వైజ్ఞానికముగ నిష్పక్షపాతముగనే మన మేకలిపి గ్రహించవలెను. రోమకలిపి విజాతీయమని నాకును చిరాకుగనుండినది. కాని 1934 లో నేను టర్కీ వెళ్ళితిని. అక్కడివారు పారసీలిపికి బదులు రోమకలిపి పెట్టిరి. అది వారికెంతో లాభించినది. మనప్రజలలో నూటిలో 90 మంది అజ్ఞులు. వారి కేలిపియు తెలియదు. కనుక వారికి లిపి మార్పు కష్టము లేదు. రోమకలిపిద్వారా మనము యూరపుభాషలు కూడ నేర్చుకోవచ్చును. ఇప్పుడు రోమకలిపి చాలమంది కిష్టము కాదు; కాని, తుదకదే మంచిదగునేమో!

ఇక నిదానముగ పరిష్కరించు సమస్యలలో మొదటిది జనాభావృద్ధి. ఇదివరకే కోట్లకొలది జనులు అన్నము బట్ట లేకయుండగా, ఇప్పుడీదేశమందు సాలుకు 30 లక్షలచొప్పున జనాభా హెచ్చుచున్నది. ఈరీతినివృద్ధియగుచుంటే, మనదారిద్ర్య సమస్యను పరిష్కరింపలేము. ఉన్నవారి కన్నము బట్ట చమువు నిచ్చుటకు సాధ్యమగువరకు, జనాభావృద్ధి నిల్పుటమంచిది.

దేశదారిద్ర్యము పోగొట్టుటకై భూస్వామిపద్ధతిమార్చి, వ్యవసాయకుల ఋణములు తగ్గించవలెను; గ్రామజనులకు చౌకగ బకులిప్పించవలెను. సహకారపద్ధతి వృద్ధిజేయవలెను.

వ్యవసాయము వైజ్ఞానికముగ జరిగించి, పంట హెచ్చింప వలెను. ఆర్థికసౌభాగ్యముకై పరిశ్రమలను ప్రభుత్వమువారే నడుప వలెను. ఆధునిక పరిశ్రమలతో పోటీయున్నను వృద్ధిచేయదగు గృహపరిశ్రమలేవో కనిపెట్టి, వాటిని బాగుగ ప్రోత్సహించ వలెను. మనదేశము గ్రామభూయిష్టము, వ్యవసాయప్రధాన ము. నూలువడకుట బట్టలనేత మున్నగు కొన్ని గృహపరిశ్రమ లు మనకుచాల సరిపడును. కాని, వాటితో పోటీ సేని యాంత్రిక పరిశ్రమలవృద్ధియు అవసరమే. అంతేగాక గ్రుబాధలను తగ్గించు టకు మాత్రము గట్టిగ యత్నించవలెను.

మనవ్యవసాయ పరిశ్రమ వస్తువుల ఉత్పత్తిని సరఫరాను కూడ క్రమముగా సంఘగతముగ చేయుప్రణాళికయు కావలెను. అందుకు బహులువగైరాలద్వారా మూలధనము కూర్చవలెను.

రాష్ట్రీయపాలన నిక్కువకికట్టలేదు. 11 లో 7 రాష్ట్ర ములందు కాంగ్రెసువారే మంత్రులు. తద్వారా కాంగ్రెసును బలపర్చవలెను. కాంగ్రెసువారు మంత్రులగుటచే లాభముకన్న నష్టమే హెచ్చగునేమోయనినేను మొదట కాంగ్రెసుమంత్రిత్వ మును వ్యతిరేకించితి. ఆభావముతప్పని తేలినచో మంచిదే.

కాంగ్రెసువారే మంత్రులైనను పరిపాలనను సివిల్ సర్వీసుఉద్యోగులే జరిగింతురు; వారిని వారితత్వమును మార్చ వలెను. అప్పుడుగాని కాంగ్రెసు బలపడదు; మనమంత్రులు సరిగా పనిచేయలేరు. జర్మనీలో సోషలుడెమాక్రట్లు మంత్రు

లైనప్పుడును, ఇంగ్లండులో కార్మికులు మంత్రులైనప్పుడును, ఇట్లే జరిగినది. మనదేశమందు దీయుద్యోగులను బ్రిటిషువారే నియమింతురు. అందు పెద్దఉద్యోగులు చాలవరకు బ్రిటిషు వారే. వారిదృష్టి, ధోరణి, భారతీయములు జాతీయములు గూడ కావు. వారిదృష్టిమారినగాని జాతీయప్రణాళిక అమలు జరుగదు. అందు పెద్దఉద్యోగములు భారతమంత్రి చేతిలోనివి; రాష్ట్రీయప్రభుత్వము వారివి కావు. ఇదే పెద్దచిక్కు.

కాంగ్రెసుమంత్రు లాయారాష్ట్రములందు విద్య, ఆరోగ్యము, మద్యనిషేధము, ఖైదుసంస్కరణ, పల్లపుసాగు, పరిశ్రమలు, భూపద్ధతి, కార్మికోద్ధరణ, వగైరాలలో పునర్నిర్మాణము చేయవలెను. వీలైనంతవరకు దేశమంతట నొకేపద్ధతి పెట్టవలెను. అందుకై అన్నిరాష్ట్రముల కాంగ్రెసుమంత్రులు కలసి సంప్రతింపవచ్చును. క్రిందటి అక్టోబరులో మనకార్మికమంత్రులట్లు చేసిరి. మరియు కాంగ్రెసువర్కింగుకమిటీవారు ఆయాశాఖలమంత్రివర్గముకు తగుసలహాలనీయవచ్చును. అందుకు వారి రాష్ట్రసమస్యలను వర్కింగుకమిటీవా రవగాహనచేసుకొని ఉండవలెను. వర్కింగుకమిటీవారు స్వాతంత్ర్యయోధులకు సూత్రధారులగుటేగాక, స్వతంత్రభారత మేర్పడునప్పుడు తామే మంత్రులగుటకు తగు జ్ఞానానుభవములను సంపాదింపవలెను. ఐర్లండులో డివాలెరాపక్షమును, ఈజిప్టులో వాఫ్దపక్షమును, బ్రిటిషుప్రభుత్వముతో పోరునప్పు డిట్లేచేసినారు; తరువాత

మంత్రులైనారు. అట్లే మన కార్యసమితిసభ్యులు తమనిత్యకృత్య ములఁ జేయుచునే, తామధికారమునకువచ్చినప్పుడు బహిష్కరింప దగుననుస్యలనిప్పుడు గ్రహించవలెను.

ఈక్రొత్త చట్టపు ఫెడరలు రాజ్యాంగమును మన మరి కట్టవలెను. "ఈక్రొత్తచట్టమును కాంగ్రెసు నిరాకరించినది. ప్రజాప్రతినిధులే తగు రాజ్యాంగ మేర్పర్చవలెను. కాని, స్వాతంత్ర్యయుద్ధమునకు బలమేర్పడుటకై, రాష్ట్రములందు మంత్రిత్వము కొన్నాము. ఫెడరలు ప్రణాళిక కాయాలోచన యుండదు. ఈరాబోవు ఫెడరేషను భారతముపై సామ్రాజ్యబంధము నింకను బిగించజేయును. ముఖ్యవిషయముల నీఫెడరలు బాధ్యతనుండి తప్పించినారు. స్వేచ్ఛాయుతమగు రాష్ట్రములు కలసి సమిష్టిపాలనచేయుట మంచిదే; కాని యిందు చేరు సంస్థానములందు ప్రజాయత్తపాలనయు, పౌర స్వాతంత్ర్యము వగైరాలును, లేవు.అట్టి సమిష్టిపాలనలో సంఘర్ష మెప్పుడు నుండును. కనుక అట్టి ఫెడరేషనును ప్రజలు మంత్రులుగూడ బహిష్కరించి అడ్డుకొనవలెను," అని వర్కింగు కమిటీ తీర్మానించినది.

ఈఫెడరేషనులో నింకను ముఖ్యలోపములున్నవి.ద్రవ్య వ్యాపారవిషయములందు బ్రిటిషువారు కొన్ని రక్షణలు పెట్టుకొన్నారు. సేనా విదేశవిషయములగూర్చి ప్రజలకెట్టి యధికారమును లేదు. సొమ్ముఖర్చులో చాలభాగమునకు మన కధికా

వేయుడగు. ఈ 1937-38 సాలు బడ్జెటు మొత్తం 77.9 కోట్లరూప్యములలో, 44.6 కోట్లు సేనకే ఖర్చగును. ఫెడరలు ఆదాయములో నూటికి 80 వరకు గవర్నరు జనరలు యిష్టమే. ఇదికాక, రిజర్వు బ్యాంకు, ఫెడరలు రైల్వే సమితి యున్నవి. విదేశవస్తువుల దాడినుండి దేశీయవస్తువులను మనదేశమునకును రక్షింపనీలులేని నిర్బంధములు గలదినిజముగుస్వరాజ్యముకాదు. "బలీయమగు ఆంగ్లవ్యాపారమునుండి చిన్నవగు భారతపరిశ్రమల కిచ్చురక్షణను గూడ విభేదమని ఆక్షేపించుట భారతీయుల నుశాశ్వతదాస్యమునకుంచుటే. బకాసురునికి మద్రిగుజ్జుకు హక్కులలో సమత్వమేమి ?" అని 1931 లో, గాంధి యిర్విను సమాఖ్య కాగానే, యంగిండియాపత్రికలో గాంధిమహాత్ముడొక ప్రసిద్ధవ్యాసమున వ్రాసెను.

మన తీరవ్యాపారమును మన నౌకలకై కాపాడుట వగయిరా యిప్పుడున్న స్వల్పాధికారములు గూడ భారత శాసనసభకు క్రొత్తసంస్కరణల తరువాత పోవును. నౌకాపరిశ్రమ ఆర్థికముగను దేశరక్షణకును గూడ ముఖ్యావసరము. కొన్ని బ్రిటిషు డొమినియనులు పెట్టుకొన్న రక్షణ పద్ధతులు గూడ మన కింక సాధ్యము కాకుండ జేసినారు. విదేశీయులనుండి మన జాతీయవ్యాపారముల కవసరమగు రక్షణ నిచ్చుట తప్పదు. ఈహక్కు నేసందర్భములోను వదలుకోకూడదు. ఉ॥ బ్రిటిషు సామ్రాజ్యములోనిదైనను ఏదేశములో నైనను బ్రిటిషు ప్రజలనుండు

కొన్నిహక్కులుబ్రిటిషువారికి లేకుండ ఐరిషు జాతీయతాపౌరత్వ శాసనమను చట్టము 1935 లో ఏర్పడినది. అట్టిది మనకును ఉండుట ముఖ్యము. లేనిచో, ఉన్నగోడును చెడును.

మనదేశపు విదేశవ్యాపారము నిప్పుడు తరుచు బ్రిటిషు వారి సౌకర్యమునుబట్టి అతుకుల పురాణముగ నియమించుచు న్నారు. బ్రిటనుకన్న విదేశములతోనే మనకు వ్యాపారలాభము హెచ్చు. వాటికి బాధలేకుండునట్లు షరతు లుండవలెను. బ్రిటి షువారితో మనకు రాజకీయాధీనతయున్నది; పైగా, మన విదేశ వ్యాపారముకు బ్రిటిషువారార్థిక నిర్బంధములుగూడ పెట్టుట కేవలమన్యాయము.

'ఒట్టావా' సంధిని మనశాసనసభవారు రద్దుచేసివారు. కాని కొత్తసంధికిరాయబారము లెంత కాలమునకును ప్రభుత్వము తెమల్చుట లేదు. ఇంకనుఆసంధిషరతు నేఉంచి, బ్రిటిషుపరిశ్రమల కన్యాయలాభము గల్గించుచున్నారు. ఇప్పటి పరాధీనస్థితిలో మన ఆర్థికస్థితియు బ్రిటిషువారికి లోబడియే యుండును. బ్రిటి షు సౌకర్యపు షరతులు రాజకీయాధారములు. ఇప్పుడు జరుగు బ్రిటిషుభారతవ్యాపార చర్చలకు లోబర్చక, ఇతరదేశముల తో నుభయతారకమగు సంధులను మనము చేసుకొనవలెను. ప్రతివ్యాపారసంధియు మన శాసనసభవా రామోదించినప్పుడే అమలుకు రావలెను.

పీటికితోడు ఈఫెడరలు అసెంబ్లీ నిర్మాణమును వట్టి అస మంజసము. సంస్థానప్రజలసంఖ్య మన బ్రిటిషు భారతప్రజల లో నూటికి 24 చొప్పున నున్నారు. కాని ఆసంస్థానరాజులకు క్రింది శాసనసభలో నూటికి 33 చొప్పున, పైసభలో నూటికి 40 చొప్పునగూడ, సభ్యత్వ మిచ్చినారు. సంస్థానప్రజలకు మాత్రము అసలే సున్న.

ఇట్టి ఫెడరలు ప్రణాళికను కాంగ్రెసువా రెన్నడును సమ్మతింపరు. దానిని నిర్బంధముగ పెట్టినను, దానిని నిరోధిం చితీరవలెను. అందుకు రాజ్యాంగపద్ధతులేగాక, శాంతన్యాయ పద్ధతులన్నిటిని, అవసరమైతే చరమాస్త్రమగు సమిష్టిశాసనో ల్లంఘనముగూడ, ప్రయోగింపవలసియుండును. అట్టిది వచ్చుచో, మనబ్రిటిషు ప్రాంతములందే గాక, ఆయుద్యమము స్వదేశరాజ్య ములకును వ్యాపించగలదు.

త్వరలోనే ఫలప్రదమగు పోరుసల్పుటకై, మనయిల్లు చక్కబెట్టుకోవలెను. ఈకొద్దియేండ్లలో ప్రజలలో మంచి ప్ర బోధము గల్గినది. అందువల్ల క్రొత్తసమస్య లేర్పడినవి. ఏబదివేల జనుల పెద్దసభలుజరుగుట యిప్పుడు మామూలైనది. ఇట్టి సభ లను ఉత్సవములను సక్రమముగ నియమించుట కష్టముగు చున్నది.

మరియు, ఈయుద్భూతప్రజాశక్తిని సవ్యమార్గమున విని యోగించుటకు నిగ్రహముగల వాలంటీరుదళ ముండవలెను.

అందుపైన సమర్థులగు నుద్యోగులుండవలెను. నాయకులు కాదగు యువకులకు తరిఫీయతు నీయవలె. ఈదేశసేవకులకు మంచి రాజకీయ జ్ఞానమును అనుభవమును కల్గించినప్పుడే, వారు మంచి నాయకు లగుదురు. ఇంగ్లండులోను జర్మనీ వగయిరా సర్వాధికారి రాజ్యములందును, వేసవిబడులు మున్నగునవేర్పడి యున్నవి. మనయోధుల జ్ఞాన కౌశల్యములను వృద్ధి జేయవలెను. బుద్ధిమంతులగు యువకులను కాంగ్రెసులోనికి తీసుకొని, ఉన్నవారిని కుశలురుగ జేయవలెను. యూరపులో కొన్ని దేశముల పద్ధతులు గమనింపుడు. మన ఆదర్శములు వేరైనను, వైజ్ఞానికమగు తరిఫీయతు లందరికిని అవసరమే. నాజీల 'లేబర్ సర్వీసు కోర్' (=కార్మికసేవాదళము) వంటివాని పద్ధతులను మనమును పెట్టుకోవలెను.

ఇక ట్రేడుయూనియను కాంగ్రెసుకు రయితుసభలకు కాంగ్రెసుతో సంబంధమును నిర్ణయించవలెను. కాంగ్రెసుకు బయట ఇట్టివి కావలెనని కొందరు, కూడదని కొందరును, అనుచున్నారు. ఇవిచాల యేండ్లనుండి యున్నవి. ఇప్పుడు పోమ్మన్ననుపోవు. చారిత్రకముగ వాటి యవసరముండి యుండును. ఇట్టివితరదేశములందు నున్నవి. ఈసంస్థలు జాతీయకాంగ్రెసు కడ్డమురాకూడదు. కాంగ్రెసే రాజకీయబలముసాధించు ప్రజాయుద్ధపు సాధనము. దాని కనుగుణముగనే తక్కినసంస్థలును రాజకీయములందు పనిచేయవలెను.

అందుకై చాలమంది కాంగ్రెసువారిరయితుసభల లోను ట్రేడుయూనియనులలోను చేరవలెను. ఈసంస్థలు తమ ఆర్థికవిషయములనే ముఖ్యముగ జూచుకొనవలెను. ఈకార్మిక కర్షకసంఘములకు కాంగ్రెసులో సంఘప్రాతినిధ్య మిచ్చుట యెప్పటికైన అవసరమగునని నాకు తోచినది. సామ్రాజ్యవ్యతిరేకసంఘములన్నియు కాంగ్రెసుయాజమాన్యమున కలసిపోరవలెను. వాటిభావములను స్థిరత్వమును చూచియే ప్రాతినిధ్య మీయవచ్చును. రష్యాలో 'అక్టోబరు విప్లవము'లో కార్మిక కర్షకయోధులందరును ప్రధానభాగము వహించిరి. కాని బ్రిటనులోని ట్రేడుయూనియనులు మితవాదులుగ నున్నవి. ఈసంస్థలను చేర్చినచో మనదేశపు కాంగ్రెసులో నెట్టిమార్పువచ్చునో గమనించవలసినదే. ఒకప్పుడు వాటికి జాతీయాదర్శ ముండదు. ఎట్లైనను ఇవియు కాంగ్రెసును అన్యోన్యతతో పని చేయుట ఉభయులకును మంచిదే. కనుక ఇవి కాంగ్రెసు దృక్పథములోనే యుండవలెను.

కాంగ్రెసులో సోషలిస్టుపార్టీ (=సామ్యవాదిపక్షము) ప్రత్యేకముగ నుండవలెనా ? నే నాపార్టీ సభ్యుడను కాను; కాని, ఆసిద్ధాంతములు, ప్రణాళిక, నాకిష్టములే. ఉగ్రవాదులొకపక్షముగ కలియుటమంచిదే. దానిని పార్టీయని పిల్చినను, మానినను, అది సామ్యవాదిగ నుండవలెను. సామ్యవాదము ప్రస్తుతసమస్యకాదు; కాని స్వరాజ్యమువచ్చినమీదట సామ్య

వాద మవసరమగును; కనుక ఆసిద్ధాంతముల నిప్పటినుండి వ్యాపింపజేయుట కాకపోయుండుట మంచిదే.

మనదేశముకు విదేశాంగశాఖనుగూర్చి నేను శ్రద్ధవహించియున్నాను. మనకంతర్జాతీయసంబంధ ముండవలెను. మున్ముందు మనజాతీయయుద్ధముకు విదేశీయపరిణామములు లాభకరమగును. కాని మనము ప్రపంచసమస్యలను గ్రహించి, వాటిని మన కనుకూలముగ వినియోగించుకోవలెను. మధ్యధరాప్రాంతములో ఇంగ్లీషువారికి ఇటలీవారికి కలతగల్గినసమయము కనిపెట్టి, తానుయుద్ధముచేయకయే ఈజిప్టు స్వతంత్రమై, ఇంగ్లండుతో మైత్రిసంధి సంపాదించినది; ఈసందర్భమున, ఆయాదేశముల స్వాంతరాజకీయముల ప్రసక్తి మన కక్కరలేదు. వారిరాజ్యపద్ధతి యెట్టిదైననుసరే; ప్రతిదేశమందును మన స్వాతంత్ర్యముగూర్చి సానుభూతిగలవారున్నారు. రష్యావారు సామ్యవాదులైనను, అందరు భిన్నులతోను స్నేహసంధులజేసుకొని, అన్నిప్రాంతములనుండి సాయ మొందుచున్నారు. కనుక మనతో సానుభూతి నన్ని దేశములందును గల్గింపుడు. మనదేశపు ఫిల్ములు కళాప్రదర్శనములు నందుకు పనికివచ్చును. చీనావారు చిత్రకళలద్వారా యూరపులో మంచిపేరు సంపాదించుకొన్నారు. వ్యక్తుల సంబంధము నవసరమే. విదేశములందుండు మన విద్యార్థుల యవసరములకు వారికి కాంగ్రెసు సాయపడవలెను. వారు మనదేశముతరపున ప్రచారము చేయవలెను.

మనసంస్కృతి తెల్పు మంచిఫిల్ములుగూడ మనకు ప్రతిష్ఠగల్గించును. ప్రతివిదేశమందును మనసంస్కృతికి ప్రచారకులుండవలెను. వారు ముందు మనరాయబారులుగ నుపయోగింతురు. ఆదేశములలోగూడ, మనయందు సానుభూతిగల కొద్దిమంది ఘనులున్నారు. యువకులును విద్యార్థులును మనదేశముగూర్చి యుత్సుకులైనారు. అందుకై, యూరపు,అమెరికా, ఆఫ్రికా, ఆసియాలలో మనకాంగ్రెసువారు ప్రతినిధుల నుంచవలెను. మధ్య దక్షిణఅమెరికాలలో మనలగూర్చి యుత్సాహమున్నది. ఆప్రాంతములందు మనవారెవరును శ్రద్ధవహించలేదు. ఈ సాయోగకార్యములలో కాంగ్రెసుకు మనసాంస్కృతిసంస్థలును వ్యాపారసంఘములును సాయపడవలెను; ఆయా అంతర్జాతీయ సంస్థలద్వారా వ్యాపించవలెను; అంతర్జాతీయసభలకు మనవారు వెళ్ళుచుండవలెను.

అంతర్జాతీయ సంయోగమనగనే, బ్రిటిషువారిపై కుట్రజేయుటయని కొందరు భ్రమపడవచ్చు. మనకట్టియవసరము లేదు. మనచర్యలు నిరాక్షేపణమైనవి, బహిరంగమైనవి. మనదేశ మాటవికమని, మనకు నాగరికత నేర్పుట కింగ్లీషువారవసరమని, విదేశములందు ప్రచారమున్నది. మనయథార్థసంగతి మనసంస్కృతిస్థితి విదేశీయులకు తెల్పిన చాలును. ఆయపవాదము తొలగిపోవును. అంతట ప్రపంచభావములు మనకనుకూలమై, మనవాదము నిరాక్షేపమగును. జాంజబరు, కెన్యా, దక్షిణా

ఫ్రికా, మలయా, సింహళము, మున్నగు విదేశములందున్న భారతీయులపైన కాంగ్రెసు కెప్పుడు ననురాగమే. కాని మనమే యింకను దాస్యమందున్నాము; వారికి సాయము చేయలేకున్నాము. మనకు స్వాతంత్ర్యము రాగనే ప్రపంచమున మన పలుకుబడి హెచ్చి, వారికిని సాయపడుదుము. మనచుట్టుపట్ల దేశములతోను పరస్పర సంస్కృతిసంబంధము హెచ్చించుట మంచిది. ముఖ్యముగ బర్మాసింహళములతో మనకు పూర్వము నుండి సంబంధమున్నది; దాని నెక్కువ సన్నిహితముగ జేయవలెను.

మిత్రులారా, ఇక రాజకీయబందీలు, నిర్బంధితులు, వీరివిడుదల గూర్చి మన మూవచ్ఛక్తిని వినియోగించవలెను. కాంగ్రెసు మంత్రులలోగూడ కొందరీపనినింకను పూర్తిచేయలేదు † త్వరలో నీపనిచేసిన, అందరికిని మంచిది.

ఈనిర్బంధితులే గాక, విడుదలయైనవారును బాధపడుచున్నారు. వారారోగ్యముచెడి, జబ్బుపడి, నిరాధారులై వారు- దేశసేవకై సర్వస్వ మర్పించి దీనులై బాధపడువారికి సానుభూతిచూపి, యథాశక్తిగ సాయపడుట మనఅందరిధర్మము. ఇంకొకమాట; పరిస్థితులిప్పుడు క్లిష్టమైనవి. కాంగ్రెసులోని

† బీహారు సంయుక్తరాష్ట్రములందు రాజకీయ బందీలను విడుదల చేయలేదని ఆందోళన జరిగినది; ఇంతలో ఈసమస్యకొరకే ఆరాష్ట్రముల మంత్రులందరును తమయుద్యోగములకు రాజీనామాల నిచ్చినారు. అంతటా ఆబందీలందరి విడుదలకు గవర్నరలొప్పుకోగా, మరల పనిచేయుచున్నారు.

రెండుపక్షములకు విభేదములున్నవి. బయట బ్రిటిషుసామ్రాజ్యము నెదుర్కొనవలెను. మన పాలకులు యుక్తులుపన్నినను, లోబడక, మెలకువ ఐకమత్యముగల్గి, ధీరులై తుపానుకును చెదరక నిలువవలెను. సామ్రాజ్యవ్యతిరేకు లందరికిని కాంగ్రెసే రంగస్థలము; దేశవిముక్తికిదేసాధకము. కాంగ్రెసుజండాక్రిందనే జాతీయపక్షములవారందరును కలసిపోరవలెను. తీవ్రవాదులందరును తమశక్తులనుకూర్చుకొని, కాంగ్రెసును ప్రజాయత్తముగ జేసి సామ్రాజ్యవ్యతిరేకి సూత్రముపైన పునర్నిర్మాణముచేయించవలెను. ఈవిషయమున బ్రిటిషుకమ్యూనిస్టుపక్షమువారు నేకాభిప్రాయులైనారు. వారు కాంగ్రెసుఆశయమునంగీకరించినారు.

గాంధిమహాత్ముడికను చాలయేండ్లు వర్ధిల్లుగాక, ఇప్పుడు మనకాయన యవసరము చాలహెచ్చు. మన యైకమత్యము కాయన కారకుడు. మన యుద్ధములో ద్వేషభావము లేకుండ జేయును; భారతీయస్వాతంత్ర్యమునకును, మానవకల్యాణమునకునుగూడ, ఆయన యవసరమున్నది.

మన దేశముకొరకేగాక, మానవజాతికొరకును; మనము పోరుచున్నాము. మనకుస్వాతంత్ర్యమువచ్చినచో, నరజాతియంతయు రక్షితమగును. *

---

* ఇంతటితో లిఖితభాగమైనది. తరువాతది అధ్యక్షుడప్పుడు అనువుగ జెప్పినది.

బిహారుసంయుక్తరాష్ట్రములం దిప్పుడేర్పడిన క్రిమతకు గవర్నరుజనరలే బాధ్యుడు. మంత్రులతప్పులేదు. మంత్రులమాటలు పాలనలో కల్పించుకోనని మాటయిచ్చి, రాజకీయఖైదీలవిడుదలకిప్పు డడ్డముగుట న్యాయము కాదు. అఖైదీలందరిని విడుదలచేయింతుమని ఎన్నికసమయములో కాంగ్రెసువారు ప్రజలకు వాగ్దానముచేసిరి. అట్లుజరిగించుట వారివిధి. అఖైదీల నదలినచో దేశముకు ప్రమాదము గల్గుననుట హాస్యాస్పదము. ఇండియాగవర్నమెంటుఆక్టు 126 (5) ఇందుకువర్తించదు. ఈరాష్ట్రీయస్వాతంత్ర్యము నట్టి మాయయని కాంగ్రెసు వాదము; అది బ్రిటిషుప్రభుత్వపు ఈచర్యవల్లను ఋజువైనది.

# 20. విద్యార్థుల కుపన్యాసము.



[ఈసారి యూరపునుండి సుభాషు వచ్చువప్పుడు లండనులో భారతీయవిద్యార్థులందరును 14-1-1938 తేదిని గొప్ప సన్మానసభజేసిరి. అందాయన యిట్లుపన్యసించినాడు]

భారతీయ సింహళ విద్యార్థులతో కలియుట నాకు చాల సంతోషకరమైనది, విద్యార్థులే ముందు మనదేశనాయకులు కావలెను. మీరు వినోదములతోనే తృప్తినొందకూడదు. దేశక్షేమముకై జైళ్ళయందు కష్టములసహించుటకును అలవడవలెను. మీలో ఇకముందు లేఖకులు గ్రంథకర్తలుఅగువారును జైలుఅనుభవమునొందుట లాభకరము. అందుచే కళాజ్ఞానము గలుగును. మానవతత్వపువిశేషములును, కష్టసుఖములును, బోధపడును. దేశబంధుదాసుగారితో జైలులో స్నేహముజేసి ఒకగజదొంగ తరువాత బాగుపడి ఉదారుడగుట నేనెరుగుదును. మీరు జీవితమందు దేశమును ఆదర్శమును పెట్టుకొనవలెను. అట్లైనచో జైలులో నిర్విచారులై సంతోషముతో నుండగలరు. జైలుఅనుభవము మీలో తరువాత ఘనతను గలిగించును. అది తపస్సువలె మీవ్యక్తికి వికాసముగలిగించును. పూర్ణస్వాతంత్ర్యపుఆదర్శమొక్కసారిగ వచ్చునదికాదు. దీనిని మొదట 1906 లో శ్రీ అరవిందఘోషును తరువాత శ్రీ తిలకుగారును బోధించిరి; కాని, 1929 లోనే కాంగ్రెసువారు

మహావ్యక్తియగు శ్రీ జవహర్లాలు అధ్యక్షతక్రింద, సంపూర్ణ స్వాతంత్ర్యమే మనలక్ష్యమని తీర్మానించిరి.

స్వాతంత్ర్యమనగా ప్రజలందఱికిని ఆర్థికమోక్షముకూడ కావలెనని గ్రహించవలెను. ఈఆర్థికదాస్యపువిమోచనకు మన దేశపు గొప్పగొప్ప భూస్వాములును పుంజీపతులును అడ్డమౌ రాజకీయయుద్ధముండును మనబ్రిటిషుపాలకులతో లాలోచీ యగుటయు కలదు. అప్పుడు వారితోనుపోరుటకు మనము సిద్ధముకావలెను. బ్రిటిషుపాలనలో మనగ్రామజీవనమును పరిశ్రమలును క్షీణించినవి. వాటినుద్ధరించుట:మీయందరిబాధ్యత. మరియు కులతత్వమువలన 'వర్ణాశ్రమస్వరాజ్యసభ' మొదలగు కొందరు నిమ్నజాతుల నణగద్రొక్కుచున్నారు. మీరు దీనోద్ధరణకు కంకణముగట్టి, అట్టి 'సభ'లతోను పోరుటకు సిద్ధము కావలెను. ఇట్టి కొన్నికక్షలసాయముండుటవల్లనే, బ్రిటిషువారు మనప్రజలను దాస్యమందుంచగలుచున్నారు.

ఈస్వాతంత్ర్యయుద్ధపు కీలకమును గాంధీమహాత్ముడు కనిపెట్టినాడు. అదే'శాంతముగు అసహకారము.' ఇప్పుడు మన దేశపుప్రజలలో ప్రబోధముగల్గినది. వారిని సరిగానడపు బాధ్యత నాయకులది.

ప్రభుత్వపునిరోధమువలన ప్రజోద్యమముతగ్గుటకు బదులు మరింతహెచ్చును. క్రిందటి శాసనసభలయెన్నికలలో ప్రభుత్వమువారు మిడ్నపురకాంగ్రెసుసంఘములు అక్రమములని చెప్పి, అవి పనిచేయకుండ నిషేధించిరి; కాని, ఆజిల్లాలోనే

కాంగ్రెసుప్రతినిధికి తక్కినచోట్లకన్న చాలహెచ్చువోట్లతో జయము గల్గినది.

మనకు స్వాతంత్ర్యము చేకూరుటకింకను చాల శ్రమ పడవలసియున్నది. ప్రజాప్రతినిధిసభ ద్వారానే కొత్తరాజ్యాంగ మేర్పడవలెను. అప్పుడే భారతసమస్య పరిష్కార మగునని కాంగ్రెసువారు నిర్ధారణచేసియున్నారు. ఇప్పుడు విద్యార్థులలోనేగాక, స్త్రీలలోగూడ ప్రబోధము కల్గినది. వారు క్రిందటి జాతీయయుద్ధమునం దెంతో సహాయముచేసినారు.

మిత్రభేదపద్ధతి నుపయోగించుట బ్రిటిషుసామ్రాజ్య పరులకు పరిపాటియైనది. ఐర్లండులో కాతలిక్కులకును ప్రొటస్టంటులకును విభేదముగల్గింపజూచినారు. కాని, బ్రిటిషుదేశీయుల ప్రచార మనర్థకరమని ఐరిషుజాతీయవాదులు గ్రహించి, ఐకమత్యముతో కృషిచేసి, స్వరాజ్యము సంపాదించుకొన్నారు. అట్లే, విదేశాధికారమునుండి బయటబడుటకు మనహిందూ ముస్లిము లేకమగుటఅవసరమని మనవారు గ్రహించుచున్నారు. మనదేశము బీదది. మీరు చాలసొమ్ము ఖర్చుచేసి నేర్చుకొన్న ఉన్నతవిద్యను ప్రజాక్షేమముకే వినియోగించుట న్యాయము. మీరు మంచినాయకులు కావలెను. ప్రజలలో నుత్సాహమున్నను చాలదు. రష్యాలో 'లెనిను' నాయకత్వములేనిచో, నవ్యరష్యాస్థితి యెట్లుండెడిదో! మాతరువాతవచ్చు నాయకులు మాకన్న మంచివారు, గొప్పవారు, కావలెను. అది ప్రగతి లక్షణము; అప్పుడే మనదేశము వేగముగ వృద్ధినొందగలదు.

---

జగత్కథ రు 2-8-0

(భూమి ఉత్పత్తి మొదలు నేటివరకు ప్రపంచ మంతటి ధార్మిక సాంఘిక రాజకీయ చరిత్ర)

తాతా చరిత్రము 0-8-0

(పెద్దపెద్దపరిశ్రమల స్థాపించిన జంషెడ్ తాతా గారి జీవితకథ, పరిశ్రమలవిశేషములు.)

నెహ్రూ చరిత్రము 0-8-0

(మోతీలాలు, జవాహర్లాలు నెహ్రూగార్ల జీవితచరిత్ర)

జవాహర్లాలు వ్యాసములు సాదా 0-6-0

గ్లేజు 0-8-0

(22 గొప్ప ఉపన్యాసములు, వ్యాసములు.)

(సచిత్రములు.)

చిరునామా,

కొ. శఠకోపాచార్యులు,

వకీలు, కాకినాడ.

